*విదేశాంధ్రవాణి : 1*

ప్రధాన సంపాదకులు :

ఆర్. అప్పారావు, పిఎచ్. డి.

# మారిషస్‌లో తెలుగువాణి

రచయిత

శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తి




అంతర్జాతీయ తెలుగుసంస్థ

హైదరాబాదు - 500 027

maarishas loo telugu vaaNi

by

**Sri Vemuri Radhakrishna Murthy**

Secretary, Dakshina Bharata Hindi Prachara Sabha, Hyderabad-500 027.

PP. viii + 68 + 2

First Impression

2000 Copies

Sept., 1977



Rs. 2.00

*Published by* :

**International Telugu Institute**

Barkatpura, Hyderabad-500 027 India.

*Printed at :*

Vivekananda Printers

Hyderabad - 500 004.

# విదేశాంధ్రవాణి

ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న తెలుగువారు సుమారు 4.80 కోట్లు. ఆంధ్ర ప్రదేశ్‌కు వెలుపల, ఇతరరాష్ట్రాలలోనూ, ఇతరదేశాలలోనూ నివసిస్తున్న తెలుగు వారు సుమారు ఒక కోటి ఉంటారు. అంటే తెలుగువారు సుమారు ఆరుకోట్ల దాకా ప్రపంచమంతటా వ్యాపించి ఉన్నారన్నమాట. ఏ ప్రాంతంలో ఉన్నా, ఏదేశంలో ఉన్నా తెలుగువారమంతా ఒక్కటే, అందరం ఒకతల్లి బిడ్డలమే అన్న ఐక్యభావాన్ని కలిగించాయి 1975 ఏప్రిల్ నెలలో హైదరాబాదులో జరిగిన ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభలు. చరిత్రాత్మకమైన ఈ మహాసభలకు యథాశక్తిసేవచేసే అవకాశం నాకు లభించడం నా అదృష్టంగా భావిస్తున్నాను. ఈ మహాసభలు ఆర్ద్రమైనభావసమైక్యతకు ప్రాతిపదికలై, తెలుగుజాతిని సమైక్యంచేసి, తద్వారా జాతీయాభ్యుదయానికి పునాదులు వేసినవనటంలో అతిశయోక్తిలేదు.

అయితే ఇట్లా ఏర్పడిన భావసమైక్యతను పెంపొందించి, పరిరక్షించుకో వలసిన బాధ్యత మనమీద ఉంది. ఆ బాధ్యతను సమర్థవంతంగా స్వీకరించ డానికే అంతర్జాతీయ తెలుగు సంస్థ ఆవిర్భావం జరిగింది. ప్రపంచ తెలుగు మహాసభల ఆశయసాధనమే ఈ సంస్థ ప్రధాన లక్ష్యం. ఇందునిమిత్తం జరిగే మహా కృషిలో భాగమే 'విదేశాంధ్రవాణి' శీర్షిక క్రింద వెలువడే ప్రచురణలు. ఈ శీర్షికలో తొలి ప్రచురణ "మారిషస్‌లో తెలుగువాణి". ప్రపంచ తెలుగు మహాసభల కార్యనిర్వాహకాధ్యక్షులు, విద్యాసాంస్కృతిక శాఖామాత్యులు, మిత్రులు అయిన శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు 1976 ఆగష్టులో మారిషస్‌లో పర్యటించారు. వారు స్వయంగా మారిషస్ తెలుగు ప్రజలమధ్య పొందిన అనుభూతుల్ని ఈ ప్రచురణ వివరిస్తోంది. కొన్ని వందలయేండ్ల క్రిందట మాతృభూమిని విడిచిపెట్టి, పరదేశంలో స్థిరనివాసం ఏర్పరచుకొన్న ఈతెలుగు సోదరులను గూర్చి సదవగాహన చదువరులకు ఏ మాత్రం కలిగినా ఈ కృషి సఫలమైనట్లే.

ఇటువంటి రచనలు ఇతరదేశాలలోని తెలుగు వారిని గూర్చి కూడా వెలువడవలసిన అవసరం ఎంతో ఉంది. ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభలు మలేషియాలో 1978 ఏప్రిల్ నెలలో జరుగనున్నవి. ఈ లోపల అంతర్జాతీయ తెలుగు సంస్థ ఇటువంటి రచనలను మరికొన్నింటిని వెలువరించగలదని ఆశిస్తున్నాను.

జలగం వెంగళరావు
ముఖ్యమంత్రి
ఆంధ్రప్రదేశ్.

# పరిచయం

పలురకాల ప్రేరణల మూలంగా ప్రపంచం నలుమూలలకు ఒకనాడు తెలుగు సోదరులు తరలి వెళ్ళారు. ఏ తీరంలో కాలుమోపినా, ఏ దేశంలో నివాస మేర్పరచుకొన్నా అక్కడి విశిష్టతని ఆకళింపు చేసికొని తమలో రంగరించుకొన్నారు. ఆ దేశ నిర్మాణంలో హృదయ పూర్వకంగా భాగస్వామ్యం పంచుకొన్నారు. ఆయా దేశాల నిజమైన పౌరులుగా నిలిచారు.

అయినా తమ ప్రత్యేకతను విడనాడలేదు. తెలుగు పలుకుల్ని మరచి పోలేదు. తెలుగు సంస్కృతిని చెరగి పోనివ్వలేదు. ఆత్మ సంస్కృతి, పరసంస్కృతీ రెండూ శబ్దార్థాల్లా కలిసిపోయి, వారిలో ఒక కొత్త సంస్కారాన్ని ఆవిష్కరించాయి. ఒక విశిష్టమైన ద్వంద్వత, పార్వతీ పరమేశ్వరుల తదేక భావంలో జాలువారే స్పృష్టాస్పృష్ట ద్వంద్వత, ఆ క్రొత్త సంస్కారానికి భూమికగా నిలిచింది. ప్రపంచ చరిత్రను నిశితంగా పరిశీలిస్తే, ఏదో ఒక దశలో, ప్రతి జాతి జీవికలోనూ ఈ ద్వంద్వత ప్రాతిపదికగా నిలచి ఉండడం విదితం కాకపోదు.

ప్రపంచం నలుచెరగుల్లోనూ వ్యాపించిన ఈ తెలుగు సంస్కృతిని ఒక్క వేదిక మీద కనులపండువుగా కనిపింప చేసే ప్రయత్నం మొదటి ప్రపంచ తెలుగు మహాసభలలో జరిగింది. ఆ సభలకు హాజరైన సదస్యుల వాంఛానుసారం, అంతర్జాతీయ తెలుగు సంస్థ ఆవిర్భవించింది. ప్రథమ దశలో ఈ సంస్థ ప్రధాన లక్ష్యాలు రాష్ట్రేతరాంధ్రుల విద్యా, సాంస్కృతిక సమస్యలను పరిష్కరించడానికి, జాతి పరమైన గుర్తింపులో సమైక్యత సాధించడానికి యథాశక్తి పరిశ్రమించడమే. ఆ కృషిలో భాగమే ఈ రోజు ఆరంభిస్తున్న 'విదేశాంధ్రవాణి' అన్న ఈ క్రొత్త గ్రంథావళి.

ఈ 'విదేశాంధ్రవాణి' శీర్షిక ఉద్దేశ్యం – పరదేశాలకు వెళ్ళిన సోదరుల గురించి పరిచయం చేయడం మాత్రమే కాదు. దేశ దేశాలకు అల్లుకొన్న ఈ తీగ పాదును అవగాహన చేసికోవడానికి, తెలుగు సంస్కృతిని గురించి సమగ్రమైన అధ్యయనం చేయడానికి ఈ శీర్షిక ఉపయోగపడాలన్నది మా ఆశయం. సమగ్రంగా తెలుగువారి సామాజిక సాంస్కృతిక చరిత్ర నిర్మించ డానికి సంస్థ చేస్తున్న ప్రయత్నానికి ఇది దోహదకారి కాగలదు ఇందుకు ప్రాతిపదికగా సామాన్య పాఠకులను కూడా దృష్టిలో ఉంచుకొని, స్థూలపరి చయాన్ని మాత్రం కల్పించడానికి ఇలాటి శీర్షిక పేరుతో భిన్న దేశాల్లోని తెలుగువారిని గూర్చి వివరించడానికి సంస్థ సంకల్పించింది.

ఈ శీర్షికలో తొలి కానుకగా ''మారిషస్‌లో తెలుగువాణి'' వెలువడడం మాకు ప్రత్యేకమైన ఆనందాన్ని కలిగిస్తోంది. ప్రస్తుత పుస్తకానికి సంబం ధించిన ప్రత్యేకత రెండు విధాలు.

మొదటిది :

మా సంస్థ అధ్యక్షులు గౌ॥ శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు స్వయంగా మారిషస్‌ను సందర్శించి అక్కడి తెలుగువారి మధ్య పొందిన అనుభవాన్ని ఈ పుస్తకం తెలుపుతోంది. తెలుగు దేశంలో, ఈ మధ్య కాలంలో, సాంస్కృతిక పునరుజ్జీవనానికి నడుము బిగించిన నాయకులలో ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారి తరువాత పేర్కొనవలసిన వారు విద్యా, సాంస్కృతిక శాఖల మంత్రివర్యులు మాన్యశ్రీ మండలిగారు. వీరు మారిషస్‌లోని తెలుగు ప్రజల విద్యా, సాంస్కృతిక విషయాలను తెలిసికోవ డానికి ప్రయత్నించడంలో ఔచిత్యం ఉంది. అనుభూతి పరంగానే కాక, ఆచరణపరంగా కూడా వారి సాధకబాధకాల్ని అర్థంచేసికొనే ప్రయత్నం చేశారు వారు. ఆ దృక్కోణం నుండి చూస్తే ఈ పుస్తకానికున్న ప్రత్యేకత సహృదయులకు అర్థం కాకపోదు.

రెండవది :

ఈ పుస్తకాన్ని యాత్రాకథన ప్రక్రియలో రచయిత రూపొందించారు. తెలుగులో యాత్రాకథనం (Travelogue) ఒక ప్రత్యేక సాహితీ ప్రక్రియగా

గుర్తింపు పొందినప్పటికీ, అందులో రాదగినన్ని రచనలు మాత్రం రాలేదు. వెలువడిన కొన్నిటిలోను ఈ రచనకూ ఒక విశిష్టత ఉంది

ఇది రచయిత బాహిర ప్రపంచాన్ని చూస్తూ పొందిన అనుభూతుల కథనం మాత్రమే కాదు. ఇందులో ఉన్నవి - ఒక సుదూర ప్రదేశంలోని తెలుగు ప్రజల సమస్యలు. వాటిని సహృదయంతో అర్థం చేసికొనే ప్రయత్నం. పరిష్కార మార్గాలకోసం తపన, తాపత్రయం ... ఇందులో వస్తువు ఒక దేశాన్ని సందర్శించడం కాదు. తమ సోదరుల హృదయాలను సందర్శించడం ......

ఎన్నడో తెలుగు దేశాన్ని వదిలి, కష్టజీవులుగా తరలి వెళ్ళిన సోదరులు తమ శ్రామిక శక్తితో ప్రస్తుత మారిషస్ దేశ సౌభాగ్యానికి తాము కూడా కారణభూతులయ్యారంటే ప్రతి తెలుగువారికి ఆనందం కలుగుతుందను కొంటాను. తెలుగువారు ఒక్క మారిషస్‌కే కాదు, గత శతాబ్దం మధ్య భాగంలో ఎన్నో దేశాలకు అలా వెళ్ళారు. ఆయా దేశసౌభాగ్యాలలో పాలు పంచుకొన్నారు. దీన్ని ఒక విజయంగా అభివర్ణించవచ్చు. మొత్తం తెలుగు జాతికే సంబంధించిన విజయాల్లో ఒకటిగా భావించవచ్చు. భావించాలి కూడాను. అయితే ఆనందాశ్చర్యాలతో పాటు, హృదయం ఆర్ద్రమయ్యేది ఎక్కడంటే, నేటికీ వారికి మాతృభాష పట్ల ఉన్న ప్రేమను, గౌరవాన్ని తెలిసి కొంటున్నప్పుడు. మారిషస్‌లో తెలుగు సంస్కృతి నిలవాలంటే ఏం చేయాలని మంత్రిగారు ఒక సామాన్య గృహిణిని అడిగినప్పుడు ఆమె అన్నమాటలు నిజంగా చదువరుల హృదయాలను కరిగిస్తాయి. ఆ మాటలను ఇక్కడ ఉదాహరించడం లేదు. దండలో నుండి పువ్వును విడిగా తీసి చూపిస్తే, పువ్వు అందాన్ని గ్రహించడంలో నష్టముండదు కాని, వెలితి ఉంటుంది. మచ్చునకు కొన్ని మాటలంటూ కొన్ని పంక్తుల్ని విడిగా ప్రవేశికలోనే ప్రదర్శించడం అలాటిదే. ఆ వెలితికి చోటు లేకుండా మీరే చదవాలని ఆశిస్తున్నాను.

సంస్థ కోరిన వెంటనే ఈ పుసకాన్ని సిద్ధంచేసి ఇచ్చిన రచయిత శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తిగారికి మా ధన్యవాదాలు. మాన్యశ్రీ మండలిగారు మారిషస్ సందర్శించిన సందర్భంలో వారితోపాటు ద్వితీయ విశ్వహిందీ సమ్మె

శన్‌లో భాగం పంచుకోవడానికి తెలుగువారి ప్రతినిధిగా శ్రీ రాధాకృష్ణమూర్తిగారు వెళ్ళారు. ఆ అనుభవం ఈ రచనకు పూర్తి నిండుదనాన్ని తెచ్చింది. పుస్తక ముద్రణను స్వల్పవ్యవధిలో పూర్తిచేసిన శ్రీ వివేకానంద ప్రింటర్స్‌కు మా సంస్థ పక్షాన కృతజ్ఞతలు.

పి. యస్. ఆర్. అప్పారావు
ప్రధాన సంపాదకులు

*చరిత్ర చాటే ఆంధ్రత్వం*

ఆంధ్రత్వ మాంధ్రభాషాచ
ప్రాభాకర పరిశ్రమః
తత్రాపి యాజుషీ శాఖా
నాల్పస్య తపసః ఫలం.

(ఆంధ్రత్వము, ఆంధ్రభాష, పూర్వమీమాంసాశాస్త్రాధ్యయనము—అందులోను యజుర్వేదీయశాఖ—ఇవి ఎంతో తపస్సు చేస్తేనే గాని లభ్యమయ్యేవి కావు) ఇది మహాపండితుడు శ్రీ అప్పయ్య దీక్షితుల కథనం.

తెలుగువారికి 2500 సంవత్సరాలకు మించిన సుదీర్ఘ చరిత్ర వున్నది. శాతవాహనులు, ఇక్ష్వాకులు, బృహత్పలాయనులు, శాలంకాయనులు, విష్ణుకుండినులు, తూర్పుచాళుక్యులు, కాకతీయ చక్రవర్తులు, కొండవీటి రెడ్డిరాజులు, రేచర్ల నాయక ప్రభువులు, విజయనగర చక్రవర్తులు తెలుగు భాషాసాహిత్యాలను లలితకళలను ఆదరించి పోషించారు. కుతుబ్‌షాహి పాదుషాలకాలంలో తెలుగువారు ఏకైకపాలన క్రిందికి వచ్చారు. బ్రిటిష్‌వారి సమయంలో వేర్వేరు పాలనాధికారాల క్రిందికి విభాజితులయ్యారు. భాషా ప్రయుక్త రాష్ట్రవిభజన ఫలితంగా ఆంధ్రప్రదేశ్ ఏర్పడి, తెలుగు మాట్లాడే ప్రజలంతా ఒకే సమైక్య పరిపాలనావధిలోనికి రాగలిగారు.

*పవిత్ర సంకల్పం*

ఆర్థిక, తదితర కారణాలను పురస్కరించుకొని తెలుగువారు ఆయా కాలాలందు ఇతర దేశాలకు తరలి వెళ్లారు. ఈనాడు మరే

షియా, బర్మా, శ్రీలంక, మారిషస్, కెనడా, ఫిజీ, అమెరికా, రష్యా మొదలుగాగల అనేక దేశాలలో తెలుగువారు నివసిస్తున్నారు. తెలుగుదేశంలో నివసించే అయిదుకోట్లమంది తెలుగువారే గాక యితర రాష్ట్రాలలోను, యితర దేశాలలోను షుమారు ఒక కోటి మందికిపైగా తెలుగువారు వున్నారు. తెలుగువారు ఆయా రాష్ట్రాల, దేశాలలోని జీవనవిధానాలను, సంప్రదాయాలను అల వరుచుకొన్నప్పటికి తమ ప్రత్యేక వ్యక్తిత్వాన్ని, సంస్కృతీ వైభ వాన్ని కాపాడుకొంటున్నారు. 1975 ఏప్రియల్ 12వ తేదీనుండి ప్రారంభమై ఒక వారంరోజులపాటు హైదరాబాదులో పెద్దస్థాయిలో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంలో వీరి నందరినీ ఒక వేదికమీదకు సమీకరించే మహత్కృషి జరిగింది. తత్ఫలితంగా తెలుగువారందరిలోను నూతన చైతన్యం వచ్చింది. విదేశాలలో నివ సించే తెలుగువారందరికి కూడా నూతనోత్తేజం కలిగింది. ప్రపంచ తెలుగు మహాసభలను విజయవంతం కావించుటకు రాత్రింబవళ్ళు కృషిచేసి విజయం సాధించిన ఆంధ్రప్రదేశ్ విద్యాసాంస్కృతిక శాఖా మాత్యులు గౌ. మండలి వెంకట కృష్ణారావుగారి మారిషస్ దేశ యాత్ర తెలుగువారి సమైక్యతకు ఎంతగానో తోడ్పడింది. ఇట్టి సుహృద్భావయాత్రలు తెలుగువారిలో సమైక్యతకు, తెలుగు భాష, తెలుగు సంస్కృతీ పరిరక్షణకు అమితంగా సహకరిస్తాయి.

*సంకల్పానికి ఆత్మకైంకర్యం*

ద్వితీయ ప్రపంచ హిందీ మహాసభలను పురస్కరించుకొని శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారి మారిషస్ యాత్ర కొనసాగి నప్పటికీ వారి ఆ యాత్రాఫలితంగా మారిషస్ దేశంలో తెలుగువాణి ప్రతిధ్వనించిందని, తెలుగు సంస్కృతి, తెలుగు వైభవం ప్రతిబింబిం చాయని, అక్కడ నివసించే 50 వేల మంది తెలుగువారిలో నూతన చైతన్యం వెల్లివిరిసిందని చెప్పవచ్చును.

గత సంవత్సరం నాగపూరులో ప్రథమ ప్రపంచ హిందీ మహాసభలు జరిగాయి. ఆ మహాసభలకు సహకరించేందుకు కొన్ని రాష్ట్రశాఖలు ఏర్పాటు చేయబడ్డాయి. ఆంధ్రప్రదేశ్ శాఖకు గౌ. మండలి వెంకట కృష్ణారావుగారిని అధ్యక్షులుగాను, నన్ను కన్వీనరుగాను హిందీ మహాసభలవారు నియమించారు. ఆంధ్రప్రదేశ్ శాఖ అనేక విధాలుగా ప్రథమ ప్రపంచ హిందీమహాసభల నిర్వహణకు సహాయపడింది. ఆ మహాసభలకు మారిషస్ ప్రధానమంత్రి సర్ శివసాగర్ రామ్‌గులాం ప్రారంభోత్సవం చేశారు. శ్రీమతి ఇందిరాగాంధీ అధ్యక్షత వహించారు. ప్రపంచం నాలుగు చెరగులనుండి రెండువేల మందికిపైగా ప్రతినిధులు వచ్చి ఆ మహాసభల్లో పాల్గొన్నారు. ఆంధ్రప్రదేశ్‌నుండి గౌ. మండలి వెంకట కృష్ణారావుగారి నాయకత్వాన వందమంది ప్రతినిధులు పాల్గొన్నారు. శ్రీ గోపాల్‌రావు ఎక్బోటే, వావిలాల గోపాలకృష్ణయ్య, వేమూరి ఆంజనేయశర్మ, డా. పి. ఎస్. ఆర్. అప్పారావు, వి. పి. రాఘవాచారి, వేమూరి రాధాకృష్ణమూర్తి ఆ ప్రతినిధులలో ఉన్నారు. ఈ హిందీ మహాసభల సందర్భంలో ముందుగా రెండు పర్యాయాలు నేను నాగపూరు వెళ్ళడం, తెలుగువారిలో ప్రపంచ తెలుగు మహాసభల్ని గురించి ప్రచారం చేయడం జరిగింది. ఆ తరువాత మండలి వెంకట కృష్ణారావుగారుకూడా నాగపూరువెళ్ళి తెలుగువారు నివసిస్తున్న అనేక గ్రామాలలో పర్యటించి అక్కడి తెలుగువారిలో గొప్ప చైతన్యం తెచ్చారు. ద్వితీయ ప్రపంచ హిందీమహాసభలు మారిషస్‌లో 1976 ఆగష్టు 28, 29, 30 తేదీలలో జరిగాయి. ఈ మహాసభలకు ఆహ్వాన సంఘ కార్యాధ్యక్షులు, మారిషస్ ప్రభుత్వ యువజన క్రీడా శాఖామాత్యులు ప్రస్తుతం అక్కడి పరిశ్రమలశాఖామాత్యులు దయానంద లాల్ వసంతరాయ్‌నుండి శ్రీ కృష్ణారావుగారికి ఆహ్వానం అందింది. తరువాత భారత ప్రభుత్వం తరపున డా. కర్ణసింగ్ అధ్యక్షతన 30

మంది సభ్యులుగల ప్రతినిధివర్గం మారిషస్ వెళ్ళి మహాసభల్లో పాల్గొన వలెనని నిర్ణయం చేయబడింది. గౌ. మండలి వెంకట కృష్ణారావు గారు ఆ ప్రతినిధివర్గసభ్యులుగా నిర్ణయింపబడ్డారు. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గౌ. జలగం వెంగళరావుగారి ఆశీస్సులు పొంది శ్రీ కృష్ణారావుగారు మారిషస్‌కు ప్రయాణమైనారు. దక్షిణభారత హిందీ ప్రచారసభ-ఆంధ్రశాఖ పక్షాన శ్రీ దయానంద్‌గారి ఆహ్వానంపై నా మారిషస్ ప్రయాణం నిర్ణయమైంది. ప్రపంచ హిందీ మహాసభలు 28, 29, 30 తేదీలలో జరుగనుండగా ముందుగా వెళ్ళి అక్కడి తెలుగువారి స్థితిగతులను స్వయంగా చూచి తెలుసుకొన వలెననే తలంపుతో శ్రీ కృష్ణారావుగారు 22 వ తేదీ హైదరాబాదులో బయలుదేరి 23 వ తేదీ సాయంత్రం మారిషస్ చేరుటకు అవసరమైన ఏర్పాట్లు అన్నీ చేసుకొన్నారు. వారితోబాటు నా ప్రయాణంకూడా అదే తేదీన నిర్ణయమైంది.

*బొంబాయి మీదుగా*

ది. 22-8-1976 రాత్రి హైదరాబాదునుండి బొంబాయికి బయలు దేరాము. హైదరాబాదు విమానాశ్రయంలో బంధువులు, మిత్రులు, అభిమానులు, అధికారులు, అనధికారులు చాలామంది విమానాశ్రయానికివచ్చి శ్రీ కృష్ణారావుగారికి వీడ్కోలు చెప్పారు. రాత్రి 9-15 ని॥లకు హైదరాబాదులో బయలుదేరిన విమానం రాత్రి 10-45 ని॥లకు బొంబాయి చేరింది. బొంబాయిలో శాంతాక్రజ్ విమానాశ్రయంలో ప్రొద్దుపోయినా బొంబాయి ఆంధ్రమహాసభ, ఆంధ్ర సారస్వతసభ, ఆంధ్ర ఎడ్యుకేషన్ సొసైటీ మొదలుగా గల సంస్థల ప్రతినిధులు, తెలుగు ప్రముఖులు విమానాశ్రయానికి వచ్చి శ్రీ కృష్ణారావుగారికి స్వాగతం చెప్పారు. ఆరాత్రి బొంబాయి ప్రభుత్వ అతిథిగృహం అంబర్‌హౌస్‌లో మకాం. పడుకోగానే నిద్రించడం, తెల్లవారగట్ల 5 గంటలకే లేచి కాలకృత్యాలు తీర్చుకొని

ప్రాతపనులన్నీ పూర్తిచేసుకొని స్నానంచేసి బయలుదేరడం శ్రీ కృష్ణారావుగారికిగల అలవాటు.

ది. 23-8-1976 నాడు ఉదయానే లేచి పనులు ముగించుకొని బొంబాయి ఆంధ్ర ఎడ్యుకేషన్ సొసైటీ సభ్యులు సహృదయులునగు శ్రీ ఎం. సుబ్బారావుగారింట్లో టిఫిన్ తీసుకొని 8-30 ని॥ లకు బొంబాయి విమానాశ్రయం చేరుకొన్నాం. మహారాష్ట్ర ఆరోగ్యశాఖామాత్యులు శ్రీ దేశాయి, సోమంచి యజ్ఞన్నశాస్త్రి, మొదలగు ప్రముఖులు శ్రీ కృష్ణారావు గారికి వీడ్కోలు చెప్పారు. ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక-అకాడమీ సహాయ కార్యదర్శి శ్రీ బి. కృష్ణంరాజుగారు, బొంబాయిలో అవసరమైన ఏర్పాట్లన్నిటినీ చూచారు. మారిషస్‌లో తెలుగు విద్యాశాఖాధికారిగా నియమింపబడిన శ్రీ వేటూరి ఆనందమూర్తిగారు, వారి సతీమణి, వారి ముగ్గురు బిడ్డలు క్రితంరోజునే బొంబాయి చేరుకొన్నారు. వారుకూడా అదేవిమానంలో మారిషస్‌కు బయలుదేరారు. బొంబాయి విమానాశ్రయంలోనియమాలన్నింటిని పాటించి 9-30 ని॥లకు విమానంలో ప్రవేశించాము. కొలంబోలో జరిగిన అలీన దేశాల రాజ్యాధినేతల సమావేశంలో పాల్గొని మారిషస్ ప్రధాని సర్ శివసాగర్ రామ్‌గులామ్,వారి సహచరమంత్రులుకూడా బొంబాయి నుండి అదే విమానంలో మారిషస్‌కు బయలుదేరారు. విమానంలో శ్రీ కృష్ణారావుగారు మారిషస్ ప్రధానిని కలుసుకొన్నారు. తెలుగువారినికూడా వారికి పరిచయం చేశారు. అదేవిమానంలో దక్షిణ భారత హిందీ ప్రచారసభ, మద్రాసు ప్రధాన కార్యదర్శి శ్రీ వేమూరి ఆంజనేయ శర్మగారుకూడా మారిషస్‌కు బయలుదేరారు. వీరుగాక ఢిల్లీనుండి మారిషస్ ప్రభుత్వంలో పనిచేసేందుకు పంపబడిన జయరాం, వారి కుటుంబసభ్యులుకూడా అదే విమానంలో బయలుదేరారు. ఈ విధంగా విమానంలో తెలుగు వాతావరణం బాగానే

ఏర్పడింది. మారిషస్ కాలమానం ప్రకారం ఉదయం 9 గంటలకు భారత కాలమానప్రకారం ఉదయం 10-30 లకు బొంబాయిలో విమానం బయలుదేరింది. ఆ విమానంలో అనేక భాషలవారు, అనేక దుస్తులవారు, అనేక అలవాట్లు కలవారు వున్నారు. ఆకాశంలో విమానంముందుకు సాగింది. పైన ఆకాశం, క్రింద సముద్రం మధ్యన విమానం. ఏకధాటిగా ప్రయాణం సాగించి మారిషస్ కాలమానం ప్రకారం 12-30 లకు రెండువేల మైళ్ళ దూరం ప్రయాణంచేసి 'సెషేల్' అను విమానాశ్రయంలో 45 నిమిషాలసేపు మా విమానం ఆగింది. చాలామంది విమానం దిగి విమానాశ్రయంలో విశ్రాంతి తీసుకొన్నారు. ఆతరువాత తిరిగివిమానం బయలుదేరింది.

*స్వాగతం పలికిన మారిషస్*

సాయంత్రం 4-30 లకు మారిషస్ దేశపు ప్లైజన్సు విమానాశ్రయంలో విమానం ఆగింది. విమానాశ్రయంలో పోలీసు బందోబస్తు ఎక్కువగానే వున్నది. ప్రపంచ హిందీమహాసభల సెక్రటరీ జనరల్ శ్రీ అనంత గోపాల్ షేవడే, ఆహ్వానసంఘం కార్యాధ్యక్షులు శ్రీ దయానందలాల్ వసంతరాయ్, భారత హైకమీషనర్ శ్రీ ఎం. ఎం. ఖురానా, విమానాశ్రయంలో అధికారిగానున్న ఆంధ్రుడు శ్రీ విద్యాసాగర్, మారిషస్ మంత్రులు, ఆహ్వానసంఘ సభ్యులు చాలామంది విమానాశ్రయంలో వేరువేరు వరసన విదేశ ప్రతినిధులందరికీ స్వాగతం చెప్పారు. ఈ కార్యక్రమమంతా టెలివిజన్ ద్వారా మారిషస్ దేశమంతటా ప్రసారం చేయబడింది. విమానాశ్రయానికి మారిషస్ ఆంధ్రమహాసభ అధ్యక్షులు శ్రీ అచ్చన్న, కార్యదర్శి శ్రీ బాలగోపాలుడు, చాలామంది తెలుగు స్త్రీలు పిల్లలు, శ్రీ కృష్ణారావు గారికి స్వాగతంచెప్పేందుకు విచ్చేశారు. శ్రీ కృష్ణారావుగారితోపాటు తెలుగుదేశంనుండి వచ్చిన ప్రతినిధులు, వారందరినీ

కలుసుకొన్నారు. అంతా ఎంతో ఆప్యాయంగా స్వాగతం చెప్పారు. విమానాశ్రయంలోనే శ్రీ శివసాగర్ రామ్‌గులాంగారిని టెలివిజన్‌వారు ఇంటర్వ్యూ చేశారు. ఆతరువాత శ్రీ కృష్ణారావు గారిని ఇంటర్వ్యూచేశారు. టెలివిజన్‌వారు అడిగిన ప్రశ్నలకు సమాధానం చెబుతూ శ్రీ కృష్ణారావుగారు మారిషస్ ప్రజలకు, ప్రభుత్వానికి, మారిషస్‌లోగల 50 వేల మంది తెలుగు ప్రజలకు శుభాకాంక్షల నందజేశారు. ద్వితీయ ప్రపంచ హిందీ మహాసభలు మారిషస్‌లో జరుపుటకు ఏర్పాట్లుచేసి తమవంటి అనేకమందికి మారిషస్ దేశాన్ని దర్శించే సదవకాశం కల్పించిన మారిషస్ ప్రభుత్వాధినేతలకు, ఆహ్వానసంఘసభ్యులకు ధన్యవాదాలు అందజేశారు. భారత ప్రభుత్వం పక్షాన మారిషస్ వచ్చిన ప్రతినిధివర్గంలో సభ్యునిగా ఆంధ్రప్రదేశ్‌కు చెందిన ఆరుకోట్ల మంది తెలుగువారి పక్షాన తనను ఎన్నుకొన్నందుకు భారత ప్రభుత్వానికి కృతజ్ఞత ప్రకటించారు. ఆ వివరం మారిషస్ దేశమందంతట ప్రసారం చేయబడింది.

శాకాహారులకు

మారిషస్ ప్రభుత్వంవారు శ్రీ కృష్ణారావుగారిని అక్కడి ప్రభుత్వ అతిథిగా భావించి ఆదరించారు. ముందుగానే పూలదండలు తేవద్దని కేబిల్ హైదరాబాదు నుండి పంపించినందున అక్కడివారికి యీ విషయం క్రొత్తగా వున్నది. అక్కడి ప్రభుత్వ మంత్రులలో కొందరికి ఆనందం కలిగించిందికూడా. భారత ప్రభుత్వ సభ్యులు గనుక వారికి విమానాశ్రయానికి 40 మైళ్ళ దూరాన, మారిషస్ రాజధానీనగరం పోర్టు లూయీకి 14 మైళ్ళ దూరాన పాశ్చాత్య సంస్కృతీ ప్రభావంలోనున్న ఒక హైక్లాస్ హోటలులో నివాసం ఏర్పాటు చేశారు. ఆ హోటలుపేరు ట్రుఐక్స్ బిచెస్ విలేజి హోటల్. వారికి ఒక మంచి కారును, అక్కడి తెలుగుస్కూళ్ళ అధికారిగానున్న పుష్పరాజ్ సూరయ్యను, కారు డ్రైవింగ్ బాగా

చేయగలిగన శ్రీ మాకే అను గన్‌మెన్‌ను శ్రీకృష్ణారావుగారికి అప్ప గించారు. ఆ రాత్రి అక్కడే 54 వ నెంబరు కాటేజిలో మకాం. యిదంతా పూర్తి అయేసరికి రాత్రి 8 గంటలు దాటింది. భోజనం కోసం భోజనశాలకు వెళ్ళాం. ఆంగ్ల, ఫ్రెంచి స్త్రీ పురుషులతో భోజనశాల కిటకిటలాడుతూ వున్నది. మత్స్యం, మాంసం, మద్యం యీ మూడింటి ప్రభావం అక్కడ ఎక్కువగావున్నది. శ్రీకృష్ణారావు గారూ, నేనూ యిద్దరమూ శాకాహారులమే. చొక్కాలు, ధోవతులు, ధరించిన మమ్మల్ని అంతా విచిత్రంగా చూడటం ప్రారంభించారు. ఎంతో కష్టంమీద వరిఅన్నం, బంగాళాదుంపలకూర, టొమాటో చట్నీ భోజనరూపంలో లభించాయి. శ్రీ కృష్ణారావుగారు వాటి తోను, రెండు మూడు రొట్టెలుతిని నేను తృప్తిపడ్డాము. ఆరాత్రి అక్కడే గడిచిపోయింది.

*ప్రజలతో కలవాలని*

ది. 24-8-76 నాడు ఉదయమే లేచాము. అప్పటికి అక్కడి టైము 7-00 అంటే మనటైము 8-30 అయినది. హోటలంతా నిశ్శబ్దంగా వున్నది. నరసంచారం యింకా ప్రారంభం కాలేదు. ఉదయం 9 గంటల తరువాతగాని నరసంచారం ప్రారంభం కాదని తెలిసింది. సముద్రం ఒడ్డునే ఆ హోటలు వున్నది. బయటికివెళ్ళి సముద్రతీరమంతా నడిచి చూచాము. హోటలంతా తిరిగిచూచాము. పల్లెటూరి ఇండ్లవలె అక్కడ గదులు నిర్మాణం చేయబడివున్నాయి. రెల్లుగడ్డివంటి గడ్డితో పైకప్పులు కప్పబడి వున్నాయి. కొన్ని గదులు చెక్కలతో కప్పబడి వున్నాయి. పల్లెటూరి వాతావరణం ఎక్కువగా వున్నది. ఆ హోటలుకు ఎక్కువగా వచ్చేది ఫ్రెంచి యాత్రీకులు. ప్రశాంతంగా అక్కడ రోజులు గడుపుకొని విశ్రాంతి తీసుకొని తిరిగి తమతమ కేంద్రాలకు వెళ్ళిపోతారు. ఆ హోటలు విశ్రాంతి తీసుకొనేందుకు చాలా అనుకూలంగా వున్నది. అదిపోర్టు

లూయీకి బాగా దూరంగా వున్నది. అక్కడవుంటే ప్రజలతో కలసి మెలసి వుండటానికిగాని, ఆక్కడి వివరాలు తెలుసుకొనేందుకుగాని అనుకూలంగా లేనందున మకాం మార్చవలెనని శ్రీ కృష్ణారావుగారు నిర్ణయించుకొన్నారు. అక్కడే టిఫిను తీసుకొని, 10-30 లకు బయలుదేరి మారిషస్ ప్రభుత్వ సెక్రటేరియట్ చేరుకొన్నాం. అక్కడ శ్రీ అనంత గోపాల్ షేవడే, శ్రీ ఆంజనేయశర్మగారలు వున్నారు. శ్రీ దయానందలాల్ వసంతరాయ్‌గారితో మకాం మార్పునుగురించి మాట్లాడారు. భారత ప్రభుత్వ ప్రతినిధివర్గ సభ్యులందరికీ, ఆ హోటలులోనే ఏర్పాట్లు ప్రభుత్వస్థాయిలో చేయబడిన వనీ, ఆ హోటలు నివాసం మార్చడం రక్షణ ఏర్పాట్లు వగైరాల దృష్ట్యా కష్టమని శ్రీ వసంతరాయ్‌గారు నచ్చచెప్పేందుకు ప్రయత్నించారు. వారు చెప్పిన విషయాలన్నింటిని అంగీకరిస్తూ, ఇక్కడి ప్రజల్ని, జీవితవిధానాల్ని, సంస్కృతినీ వారి మధ్య వుంటూ తెలుసుకోవడం తమ లక్ష్యమని, వసతిసౌకర్యాలు తగ్గినా తాముసర్దుకొని పోగలమని శ్రీ కృష్ణారావుగారు వివరించిచెప్పగా శ్రీ వసంతరాయ్ అందుకు అంగీకరించి పోర్టు లూయీలో వున్న అంబాసిడర్ అను హోటలుకు మామకాం మార్చారు. రెండవ అంతస్థులో 214వ నెంబరు గది శ్రీ కృష్ణారావుగారికీ. 215 వ నెంబరు గది నాకు యిచ్చారు. హోటలుగదులు చాలావసతిసౌకర్యాలు కలిగి పాశ్చాత్య పద్ధతిలో వున్నాయి. శ్రీ కృష్ణారావుగారి మకాం మారిన విషయం అందుకు కారణం అక్కడి వారందరికీ తెలిసింది. ప్రపంచ హిందీ మహాసభలకు వెళ్ళిన ప్రతినిధులందరికీ ఉచిత భోజన వసతి సౌకర్యం అక్కడి ఆహ్వానసంఘం కల్పించింది. ఆ రోజున యీ కార్యక్రమాలన్ని ముగించుకొని క్యూపిప్‌లో కాంటినెంటల్ హోటలులోవున్న శ్రీ వేటూరి ఆనందమూర్తిగారిని చూచేందుకు వెళ్ళాము. మరునాటికికూడా వారి సామాను ఇంకా విమానాశ్రయం నుండి

రాలేదు. ఆ మధ్యాహ్నం ఆ హోటలులోనే భోజనం. నెయ్యి, మజ్జిగ వగైరాలేమీ లేవు. వరి అన్నం, బంగాళాదుంపల కూర, టొమాటో చట్నీ, రెండుమూడు కూరలు, పచ్చికూరలు, అప్పడం, నిమ్మకాయచట్నీ వడ్డించారు. అక్కడ మంచినీళ్లు త్రాగే అలవాటు తక్కువ. అందువలన హోటళ్ళలో మంచినీళ్ళు అడిగితేగాని ఇవ్వరు. ఆ తరువాత ఎక్కడికి వెళ్ళినా మమ్మల్ని చూచి మంచి నీళ్ళుకూడా మాకు ఇవ్వడం ప్రారంభించారు హోటళ్ళవారు.

*టెలివిజన్‌లో ఇంటర్వ్యూ*

భోజనాలుకాగానే టెలివిజన్ కార్యాలయానికి వెళ్లాము. అక్కడ చిన్నయ్యస్వామి తెలుగు కార్యక్రమాలు చూస్తుంటారు. వారు హైదరాబాదులో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభల్లో మారిషస్‌నుండి వచ్చి పాల్గొన్నారు. తెలుగులో 10 నిమిషాలు, ఇంగ్లీషులో 10 నిమిషాలు, హిందీలో 5 నిమిషాలు శ్రీ కృష్ణారావు గారిని ఇంటర్వ్యూ చేశారు. ఈ కార్యక్రమమంతా ఆ సాయంత్రం టెలివిజన్‌లో ప్రసారం చేయబడింది. శ్రీ కృష్ణారావుగారు తెలుగు లోను, ఆ తరువాత హిందీలోను క్రింది విధంగా ప్రసంగించారు.

"మారిషస్ తెలుగు ప్రజలకు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, ప్రజల పక్షాన శుభాకాంక్షలు అందజేస్తున్నాను

1847లో తెలుగు దేశాన్నుండి తెలుగువారు మారిషస్ ద్వీపం వచ్చారు. ఆనాటి నుండి మారిషస్ అభివృద్ధికి అన్ని రంగా ల్లోను తెలుగువారు కృషిచేస్తున్నారు.

తెలుగువారి భాషాభివృద్ధికి, సాంస్కృతిక కార్యకలాపాలకు మారిషస్ ఆంధ్రమహాసభ 60 బ్రాంచీలతో తోడ్పడుతూ ఉన్నది.

సారవంతమైన సుందరమైన ఈ దీవిలో తెలుగువారు స్థిర నివాసం ఏర్పాటు చేసుకొని ఈ ప్రాంత అభివృద్ధికి కృషి చేయడం మాకెంతో గర్వకారణంగా ఉన్నది.

గత సంవత్సరం ఉగాదికి హైదరాబాదులో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభలకు ఈ దీవినుండి పదిమంది తెలుగు ప్రతినిధులు హాజరై మమ్ములనందరినీ ఆనంద పరచారు.

తెలుగు ప్రపంచ మహాసభలు జరిగిన తరువాత అంతర్జాతీయ తెలుగు సంస్థను స్థాపించాము. ఇతర రాష్ట్రాలలోని తెలుగువారి సమస్యలను గురించి సదస్సు జరిపించాము. ఇతర దేశాలలోని తెలుగు వారిని గురించిన వివరాలు సేకరిస్తున్నాము. 'తెలుగువాణి' అను పత్రికను ప్రచురిస్తున్నాము. మారిషస్, మలేషియా మొదలుగాగల దేశాలలో నివసిస్తున్న తెలుగువారి చరిత్ర, సంస్కృతి మొదలుగాగల వివరాలను సేకరించి ప్రకటించేందుకు ప్రయత్నిస్తున్నాము.

ఆంధ్రప్రదేశ్‌లో గల మెడికల్, ఇంజనీరింగ్ కళాశాలల్లో విదేశాంధ్రులకు సీట్లు కేటాయించుటకు ఏర్పాట్లు చేస్తున్నాము.

తెలుగు మరిచిపోవద్దని, తెలుగు వారంతా తెలుగులోనే మాట్లాడవలెనని తెలుగుదేశాన్ని, తెలుగు ప్రజల్ని, తెలుగు సంస్కృతిని మరిచిపోవద్దని ఈ సందర్భంలో ఇక్కడి 50 వేలమంది తెలుగు ప్రజలకు మనవి చేస్తున్నాను.

*హిందీ ప్రసంగం*

"మారిషస్ లో వున్నందుకు నాకు సంతోషంగా వున్నది నేను ద్వితీయ ప్రపంచ హిందీ మహాసభలో, పాల్గొనేందుకై వచ్చాను. నాగపూర్‌లో జరిగిన ప్రథమ ప్రపంచ హిందీ మహాసభలో కూడా నేనుపాల్గొన్నాను. హిందీ భారత దేశానికి జాతీయ భాష. రాజభాష. హిందీ భాష ప్రచారానికి మారిషస్ లో జరుగుచున్న ద్వితీయ ప్రపంచ హిందీ మహాసభలు మైలురాయిగా తోడ్పడగలవని విశ్వసిస్తున్నాను."

జై మారిషస్ — జై హింద్.

మారిషస్ దేశంలో సామాన్యంగా ప్రతి ఇంటిలోను టెలివిజన్ సెట్టు, రేడియో, ఫోను, సోఫా సెట్టు వుంటాయి. వాటితో బాటు ఒక

కారుకూడా వుంటుంది. అక్కడి వాళ్ళంతా ఆర్థికంగా ఎంతో సంప
న్నంగా వున్నారు. శ్రీ కృష్ణారావుగారి ప్రసంగాలప్రసారంవల్లమారి
షస్‌లోగల తెలుగువారేగాక, ఇతరభాషీయులకుకూడా శ్రీ కృష్ణా
రావుగారు పరిచితులై పోయారు. తెలుగును గురించిన ప్రచారం
బాగా జరిగింది. ఎక్కడికి వెళ్ళినా ప్రజలే వారిని మీరు ఫలానావారు
కదూ అని ప్రశ్నించసాగారు .

*నాగరికజీవనం*

మారిషస్‌లోగల ఇండ్లను గురించి కొద్దిగా పరిచయం చేయడం
అవసరం. మారిషస్ దేశంలో రెండురకాల ఇండ్లువున్నాయి. అక్కడ
15 సంవత్సరాలకు ఒక్కపర్యాయమైనా తుపాను వస్తూ వుంటుంది.
అందువల్ల పూర్వం ఇండ్లన్నీ రేకులతోను, చెక్కలతోను నిర్మాణం
చేయబడేవి. బయటికిచూస్తే ఈ యిండ్లు చాలా సామాన్యంగా
కనిపిస్తాయి. కాని లోపలికి వెళ్ళిచూస్తే అయిదు ఆరు గదులతో,
టెలివిజన్, ఫోను, రేడియో, సోఫాసెట్లు మొదలుగాగల అత్యాధు
నిక సౌకర్యాలతో నిండి, పరిశుభ్రంగాను, అందంగాను వుంటాయి.
సిమెంటు, ఇనుము లభ్యం కావడంవలన చాలా మంది పక్కాయిండ్లు
కట్టించుకోవడం ప్రారంభించారు. మారిషస్ దేశానికి 1968 మార్చి
12 వ తేదీన స్వాతంత్ర్యం లభించింది. ఈ కొద్ది సంవత్సరాలలో
ఆ దేశంలో పక్కాయిండ్లు విపరీతంగా తయారయ్యాయి. పక్కా
ఇళ్ళుచాలా అందంగా వుంటాయి. ఈ రెండు రకాల గృహాల
మీద పాశ్చాత్యసభ్యతా ప్రభావం విపరీతంగా కనబడుతుంది. అక్కడి
యిండ్లకు చుట్టు ఖాళీ ప్రదేశం వుంటుంది. ఆ ప్రదేశమంతా చెట్ల
తోను, కూరగాయల మొక్కలతోను, కళకళలాడుతూ వుంటుంది.
ఇంటికి ముందుభాగంలో గల గోడకు పెద్దపెద్ద అద్దాలు అమర్చబడి
వుంటాయి. ఆ అద్దాలపై రంగు రంగుల పెద్ద పెద్ద తెరలు అమర్చబడి
అందంగా వ్రేలాడుతూ కన్నులకు పండుగ కల్గిస్తూ వుంటాయి. ఈ

గృహాల నిర్మాణానికి అక్కడి ప్రభుత్వం సహకరిస్తుంది. సగం సొమ్ము అప్పుగా ఇవ్వడమేగాక, గృహనిర్మాణానికి అవసరమైన వస్తువులుకూడా నిర్ణీతమైన ధరలకు అందజేస్తుంది. టెలివిజన్; ఫోను, రేడియో, సోఫాసెట్లు వగైరా వస్తువుల విషయంలో కూడా పౌరులకు అక్కడి ప్రభుత్వం అనేక విధాలుగా సౌకర్యం కలిగిస్తుంది. అందువలన త్వరత్వరగా అక్కడ గృహనిర్మాణకార్యక్రమం కొనసాగి పూర్తిఅవుతున్నది.

ఇక మారిషస్ దేశంలోగలరోడ్లపరిస్థితి.సందుల్లోకివెళ్ళిచూచినా కుగ్రామాలకు వెళ్ళిచూచినా అన్నీతారురోడ్లే. అవి నిగనిగలాడుతూ పరిశుభ్రంగా వుంటాయి. చెత్తచెదారం ఎక్కడా కనబడదు. ఆ రోడ్లకు యిరుప్రక్కల కొంచెమైనా చోటు వదలకుండా చెరకుగడల పొలాలు వుంటాయి. చెరకు అక్కడ విస్తారంగా పండుతుంది. మన దేశంలో పచ్చిగడ్డి మొలిచినట్లు అక్కడ చెరకు మొలుస్తుంది. అక్కడ ఎండలు తక్కువ. చల్లని వాతావరణం. చెరకుపంటకు ఆ వాతావరణం అక్కడి సారవంతమైన మట్టి అనుకూలంగా వుంటాయి. అపరిమితంగా చక్కెర విదేశాలకు ఎగుమతి అవుతుంది. ఆదేశంలో మాత్రం చక్కెర కిలో 60 పైసలకే దొరుకుతుంది. చక్కెర ఎగుమతివలన ఆ దేశానికి మంచి ఆదాయం వస్తుంది. అక్కడ చక్కెరపరిశ్రమ ఫ్రెంచివారి చేతుల్లో వున్నదని చెప్పవచ్చును. అయితే మారిషస్ ప్రభుత్వంవారి అజ్మాయిషిమాత్రం వున్నది. చక్కెరతోపాటు టీ, పొగాకు, లవంగాలు, యాలక్కాయలు అక్కడ ఉత్పత్తి అవుతాయి. ఇక జీవితానికి అవసరమైన వస్తువులనన్నింటిని యితర దేశాలనుండి దిగుమతి చేసుకొంటారు. ఆ దేశానికి ఏ దేశంతోను వైరంలేదు. అందువలన యితర దేశాలన్నీ ఆ దేశానికి సహాయం చేస్తున్నాయి. అక్కడ వస్తువుల ధరలు మధ్యమస్థాయిలో వున్నాయి. ఫ్రాన్సు, చైనా,జపాను, జర్మనీ, ఇండియా, మొదలుగా

గల దేశాలవస్తువులు అక్కడి మార్కెట్లులో చాలా ఎక్కువగా లభిస్తాయి.

ఆరోజు అనగా ది. 24-8-1976 సాయంత్రం మారిషస్ ఆంధ్రమహాసభ స్వంతభవనంలో శ్రీ కృష్ణారావుగారికి స్వాగతసభ ఏర్పాటు చేయబడింది. మారిషస్ ఆంధ్రమహాసభ పోర్టులూయిస్‌లో రేస్‌కోర్సు మైదానానికి బహుదగ్గరలో వున్నది. తెలుగువారంతా కలిసి 1943 లో ప్రత్యేక ఆంధ్రమహాసభను ఏర్పాటు చేసుకొని రిజిష్టరు చేయించుకొన్నారు. అక్కడి ప్రభుత్వ అనుమతి ఈ సంస్థకు లభించింది. తెలుగుభాష, తెలుగు సంస్కృతీ పరిరక్షణ ఈ సంస్థయొక్క ప్రధానలక్ష్యం. ఈ సంస్థకు యిప్పుడు 60 బ్రాంచీలు వున్నాయి. 54 బ్రాంచీలకు సొంత భవనాలు వున్నాయి. ఆ భవనాల్లో రామమందిరం, కృష్ణమందిరం, విష్ణుమందిరం వున్నాయి. తెలుగువారంతా అక్కడికి చేరి భజనలు చేస్తుంటారు. తెలుగు తరగతులు నడుపుతూ, సభలు జరుపుకొంటూ వుంటారు ఇప్పుడు 3331 మంది మారిషస్ ఆంధ్రమహాసభలో సభ్యులుగా వున్నారు.

*తెలుగువారి తొలిఅడుగు*

ఈ దీవికి 1847 లో మొదటిసారిగా తెలుగువారు కూలివారుగా వచ్చారు. అప్పటికి ఈ దీవి అడవిగా వుండి వెనుకబడిన ప్రదేశంగా వున్నందున తెలుగువారు ఈ దీవియందలి గ్రామప్రాంతాలలో వుండి చెరుకుతోటల్లో కూలీలుగా పనిచేస్తూ అక్కడే నివాసం ఏర్పాటు చేసుకోవలసి వచ్చింది. పరాయిదేశంలో వుంటున్నప్పటికీ తెలుగువారు తమ పిల్లలకు రాత్రులందు విరామసమయంలో తెలుగుభాషను బోధించేవారు తెలుగు సంస్కృతిని గురించి ప్రచారం చేసుకోనేవారు. ఆ విధంగా ఈ దీవిలో తెలుగుభాష తెలుగు సంస్కృతి తరతరాలుగా అభివృద్ధి చెందుతూ వచ్చాయి.

1927 లో మొదటిసారిగా మారిషస్‌లోగల తెలుగువారు రోజ్‌హిల్ ప్రాంతంలో ప్రథమసమావేశం జరుపుకొన్నారు. త్వర లోనే శ్రీ నరసింహదాసు, రామస్వామి పైడయ్య తదితరుల ఆధ్వర్యాన 1945 లో మారిషస్ ఆంధ్రమహాసభ ఏర్పాటు చేయ బడింది. 1945 ఆగస్టు 4 వ తేదీన వెయ్యిమంది తెలుగువారు సభ్యు లుగాగల మారిషస్ ఆంధ్రమహాసభకు శ్రీ కిష్టమయ్యగారిని అధ్యక్షు లుగాను, శ్రీ రామిరికి రామసన్ గారిని కార్యదర్శిగాను, శ్రీ కె. అప్పడుగారిని కోశాధికారిగాను ఎన్నుకొన్నారు. అనేకమంది ప్రముఖ తెలుగు సభ్యులతో కార్యనిర్వాహకవర్గము ఏర్పడి, సంస్థ రిజిష్టరు చేయబడింది. ఆంధ్రుల సాంఘిక, ఆర్థిక స్తోమతును అభివృద్ధిపరచుట, వేదాంతము, సారస్వతము, లలితకళలు, విజ్ఞానశాస్త్రము, చరిత్ర మొదలగు శాస్త్రపఠనము తెలుగువారిలో పెంపొందించి ఆంధ్ర సంస్కృతిని వ్యాప్తిచేయుట, తెలుగు భాషాబోధనకు, వ్యాప్తికి పుస్తక భాండాగారాలను, పాఠశాలలను, ఉచిత విద్యా సంస్థలను నెలకొల్పుట, సభలు, సమావేశాలు జరిపి ఆరోగ్యము, శుభ్రతలను గురించి ప్రజలకు తెలియజేయుట, సంఘ ఉద్దేశ్యాలను వ్యాప్తి చేయుటకు పుస్తకములు, ప్రత్యేక సంచికలు, కరపత్రములు ప్రచు రించుట, మరణించిన సభ్యుల కుటుంబములకు అవసరమైన ఆర్థిక సాహాయ్యము చేయుట మారిషస్ ఆంధ్రమహాసభ ముఖ్యోద్దేశ్యా లుగా పేర్కొనబడ్డాయి.

అప్పటినుండి మారిషస్ ఆంధ్రమహాసభ కార్యక్రమాలు విరి విగా ప్రారంభమైనాయి. స్వంతభవనం ఏర్పాటు అయింది. దేశమం దంతట బ్రాంచీలు ఏర్పడ్డాయి. వేలాది తెలుగు ప్రజల సహకారం ఈ సంస్థకు లభించింది. ప్రస్తుతం ఈ సంస్థకు శ్రీ అచ్చన్న అధ్య క్షులుగాను, శ్రీ బాలగోపాలుడు కార్యదర్శిగాను, శ్రీ డన్లప్ప కోశాధికారిగాను, ఎన్నుకొనబడి పనిచేస్తున్నారు.

*ఆంధ్ర మహాసభలో సమావేశం*

ఆ రోజున మారిషస్ ఆంధ్రమహాసభాభవనం తెలుగు స్త్రీపురుషులతో నిండిపోయింది. చీరెలు ధరించి, ముఖాన బొట్టుపెట్టుకొని అనేకమంది తెలుగు ముత్తైదువలు సభకు వచ్చారు. పురుషులు మాత్రం ఎక్కువమంది పాశ్చాత్య దుస్తులలోనే వున్నారు. స్వాగత సభకు తెలుగు ప్రముఖులు, మారిషస్ దేశపు పార్లమెంటరీ సెక్రటరీ అయిన శ్రీ సింహాద్రి వీరాస్వామిగారు అధ్యక్షత వహించారు. శ్రీ సింహాద్రి వీరాస్వామిగారి పూర్వీకులు విశాఖపట్టణానికి చెందినవారు. ఇంగ్లీషు, ఫ్రెంచి, క్రియోలీ, హిందీ మొదలుగాగల భాషల్లో శ్రీ వీరాస్వామిగారు ధారాళంగా ప్రసంగించగల మంచివక్త. వర్తక ప్రముఖులు, సినిమారంగంతో కూడా వీరికి దగ్గర సంబంధం వున్నది. అక్కడి ప్రభుత్వంతో కూడా వీరికి దగ్గర సంబంధం వున్నది. అక్కడి ప్రభుత్వంలో పార్లమెంటు సెక్రటరీ పదవిలో వున్న తెలుగువారు వీరొక్కరే. ఈమధ్యనే జరిగిన ఎన్నికల్లో వీరు పార్లమెంటు మెంబరుగా ఎన్నికై ఇప్పుడు ధరలు, కొనుగోలు దారుల సహకార శాఖామాత్యులుగా వున్నారు. ఇటు ప్రజల్లోను, అటు ప్రభుత్వంలోను, వ్యాపార రంగంలోను పలుకుబడి గలిగినవారు. వీరి ఒక బ్బాయి చైనా యువతిని పెండ్లాడాడు. వీరి కుటుంబంమీద పాశ్చాత్య ప్రభావం ఎక్కువే. అది అక్కడి పరిస్థితుల ప్రభావం. మారిషస్ ప్రభుత్వ విద్యాశాఖామాత్యులు శ్రీ షాపరాన్, భారత హైకమీషనర్ శ్రీ ఎం. ఎం. ఖురానా మొదలుగాగల ప్రముఖులు స్వాగతసభలో పాల్గొన్నారు. ఆ సభ తెలుగువారి ఒక పండుగగా జరిగింది. ఆంధ్ర మహాసభ అధ్యక్షులు అచ్చన్నగారు ఇంగ్లీషులో స్వాగతం చెప్పారు. కార్యదర్శి బాలగోపాలుడు క్రియోలీ భాషలో ధన్యవాదాలు అర్పించారు. శ్రీ వీరాస్వామి సింహాద్రిగారు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం, ప్రజల సపోర్టు మారిషస్‌లోగల 50 వేలమంది

తెలుగువారికి కావాలనీ, డబ్బు అక్కరలేదని, తెలుగు పుస్తకాలు, తెలుగు సినిమాలు, తెలుగు సాంస్కృతిక కార్యక్రమాలు కావాలని తమ అధ్యక్షోపన్యాసంలో తెలియజేశారు. భారత హైకమీషనర్ భారత ప్రభుత్వం పక్షాన మారిషస్‌లోగల తెలుగువారికి అవసరమైన సహాయం చేయించేందుకు తాము సిద్ధంగా ఉన్నామని సభలో ప్రకటించారు. మారిషస్ విద్యాశాఖామాత్యులు ఫ్రెంచి మాతృభాషగా గలిగిన శ్రీ షాపరాన్ మారిషస్ ప్రభుత్వం పక్షాన తెలుగు ప్రజల ఎడ ఆదరాభిమానాలను వ్యక్తంచేసి భారతీయభాషలయెడ తమ ప్రభుత్వం అనుసరిస్తున్న ఉదారమైన విధానాన్ని స్పష్టంచేసి భవిష్యత్తులో ఇతోధికంగా తెలుగువారికి తోడ్పడగలమని ప్రకటించారు.

*భిన్నభాషీయులు*

మారిషస్ జనసంఖ్య 8 లక్షలకు పైగా వున్నది. వారిలో నాలుగు లక్షలకుపైగా భారతీయులు వున్నారు. ఆ దేశంలో హిందువులు, బౌద్ధులు, ముస్లిములు, క్రైస్తవులు వున్నారు. అయినా ప్రభుత్వం అన్ని మతాలను సమానంగా ఆదరిస్తున్నందున మత సంబంధమైన తగాదాలు అక్కడలేవు. ఇంగ్లీషు, ఫ్రెంచి మారిషస్ ప్రభుత్వ అధికార భాషలు. క్రియోలీ అన్న భాష అక్కడి ప్రజలంతా మాట్లాడుతారు. ఇది ఫ్రెంచి యొక్క అపభ్రంశం. దీనికి లిపి లేదు. కాని అక్కడి ప్రజల్లో దాదాపు అందరికీ ఈ భాష తెలుసు. మారిషస్‌లో హిందీ మాట్లాడే వారి సంఖ్య ఎక్కువ. అక్కడి ప్రధాన మంత్రి సర్ శివసాగర్ రామ్‌గులాం బీహారుకు చెందిన భోజపురీ అను హిందీ మాండలిక భాషా కుటుంబానికి చెందినవారు. అక్కడి ప్రభుత్వంలో హిందీ వారి ప్రాబల్యం ఎక్కువ. తరువాత తమిళుల సంఖ్య ఎక్కువ, ప్రభుత్వంలో తమిళ మంత్రులు వున్నారు. తమిళుల తరువాత తెలుగువారు. వీరికి సంబంధించిన వారు ఎవ్వరూ ప్రభుత్వంలో మంత్రి పదవుల్లో లేరు. కాని ఈ మధ్యనే శ్రీ వీరా

స్వామి మంత్రిగా నియమింపబడినారు. తరువాత మరాఠీ, తరువాత చైనా భాష, ఇవిగాక ముస్లిముల ఉర్దూ భాషకు కూడా అక్కడ ప్రాముఖ్యం వున్నది. సర్ శివసాగర్ రామ్‌గులాం రాజకీయాల్లో ప్రవేశించినప్పటి నుండి భారతీయ భాషల విషయంలో తమ విధానాన్ని స్పష్టంగా ప్రకటించారు. తాను నాయకత్వం వహించిన లేబర్ పార్టీ విధానాల్లో కూడా తమ పాలసీని చేర్చారు. తాము ఆంగ్లప్రభుత్వంలో విద్యా శాఖాధికారిగా వున్నప్పుడు వారికి నచ్చచెప్పి భారతీయ భాషలకు అక్కడి పాఠశాలల్లో స్థానం కల్పించారు. ప్రధానమంత్రి పదవికి వచ్చాక ఈ విధానాన్ని విజయవంతంగా అమలులోకి వచ్చేలా చేశారు. ప్రతి స్కూల్లోను హిందీ, తమిళం, తెలుగు, ఉర్దూ, మరాఠీ, చైనా భాషల బోధనకు ఏర్పాట్లు చేశారు. 20 మంది విద్యార్థులకు ఒక ఉపాధ్యాయుడు చొప్పున ఆయాభాషా బోధకులను నియమించారు. సుమారుగా హిందీ ఉపాధ్యాయులు 300 మంది, తమిళ ఉపాధ్యాయులు 350 మంది, తెలుగు ఉపాధ్యాయులు 108 మంది, మరాఠీ ఉపాధ్యాయులు 200 మంది, ఉర్దూ ఉపాధ్యాయులు 400 మంది, చైనా ఉపాధ్యాయులు 300 మంది దాకా అక్కడ ఉద్యోగాలు చేస్తున్నారు. ఇంగ్లీషు, ఫ్రెంచి భాషల ఉపాధ్యాయులుగా అన్ని భాషలవారు పనిచేస్తున్నారు. ఆయాభాషాబోధకులను తయారు చేయుటకు ఉపాధ్యాయ శిక్షణ మహావిద్యాలయం కూడా ప్రభుత్వం ఆధ్వర్యంలో నడుపబడుతున్నది. అక్కడ పైన తెలిపిన భాషా బోధకులకందరికీ ట్రైనింగు ఇవ్వబడుతూవున్నది. ఇందువలన అక్కడ భాషలకు సంబంధించిన తగాదాలు లేవు. అన్ని భాషల వారికి హిందీ వచ్చును. అందువలన అక్కడి ప్రజల్లో ప్రభుత్వ భాషగా హిందీకి కూడా స్థానం లభించాలనే అభిప్రాయం ప్రబలంగా వున్నది. మారిషస్‌లో జరిగిన ద్వితీయ ప్రపంచ హిందీ మహాసభలు అందుకు

దోహదంచేస్తాయనే విశ్వాసం అక్కడి వారందరికీ కలిగింది. మారిషస్ ప్రభుత్వంవారు భారతీయ భాషలకు సంబంధించిన రీసర్చి కార్యక్రమం మహాత్మాగాంధీ సంస్థాన్‌లో ప్రారంభించారు. తెలుగుకు కూడా స్థానం కల్పిస్తామని అక్కడి ప్రభుత్వాధినేతలు, భారత హైకమీషనరు శ్రీ కృష్ణారావుగారికి వాగ్దానం చేశారు. తెలుగు విద్యాధికారిగా మారిషస్ ప్రభుత్వం నియమించిన డాక్టర్ వేటూరి ఆనందమూర్తిగారికి ఆ కార్యక్రమం అప్పగిస్తామని కూడా చెప్పారు. ఇది శ్రీ కృష్ణారావుగారు తెలుగుకోసం సాధించిన ఒక విజయంగా భావించవచ్చును. తెలుగువారి మహాసభలో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గౌరవనీయులు జలగం వెంగళరావుగారు ఇంగ్లీషులోను, తెలుగులోను పంపిన సందేశాన్ని సభలో శ్రీ పుష్పరాజ్ సూరయ్య, వేమూరి రాధాకృష్ణమూర్తిగారలు చదివి వినిపించారు. అక్కడి ప్రజలు, ప్రభుత్వం తెలుగు దేశప్రతినిధిగాను, ప్రపంచ తెలుగు మహాసభలు జయప్రదంగా జరిపించిన గట్టి కార్యకర్తగాను, తెలుగుదేశ నాయకులుగాను శ్రీ కృష్ణారావుగారి ఎడ ఆదరణ చూపించారు.

శ్రీ కృష్ణారావుగారు ప్రారంభంలో మారిషస్ తెలుగు ప్రజలు, ప్రభుత్వం తమయెడ చూపిన ఆదరణకు కృతజ్ఞతలు తెలిపి తాము తెచ్చిన క్రింది వస్తువుల్ని మారిషస్ విద్యాశాఖా మంత్రి ద్వారా మారిషస్ ఆంధ్ర మహాసభకు అందజేశారు. 1. ప్రపంచ తెలుగు మహాసభల మొమెంటో, 2. 'తెలుగు తల్లి' కలర్ ఫిలిం 16 యం.యం. రీలు ఒకటి. 3, కూచిపూడి నాట్యం 35 యం.యం. ఫిలిం రీళ్లు రెండు, 4 కలర్ ట్రాన్స్‌ప్రెన్సెస్-15, 5. ప్రపంచ తెలుగు మహాసభల ఫోటోల నెగిటివులు-99, 6. తెలుగు ప్రముఖుల చిత్రాలు-45, 7. టేపు రికార్డులు, సందేశాలు 2, 8. ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారి చిత్రాలు-100 9. ముఖ్యమంత్రి

సాధించిన విజయాలపై ప్రకటించబడిన పుస్తకాలు-40, 10. ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంలో ప్రకటించబడిన తపాలా బిళ్ళలు, వాటి ఆల్బములు, 11. తెలుగు దేశానికి సంబంధించిన చిత్రాలు-132, 12. తెలుగుదేశం, యాత్రాస్థలాల అభివృద్ధిపథకాలు-24, 13. తెలుగు శిల్పకళ చిత్రాలు-10, 14. ఆయిల్ పెంటింగ్స్-26, 15. ఆంధ్ర ప్రదేశ్ చేతికళల చిత్రాలు-18, 16. శ్రీ సోమంచి యజ్ఞన్నశాస్త్రి గారు రచించిన ''మోడరన్ తెలుగు లిటరేచర్ అండ్ థియేటర్'' అన్న ఇంగ్లీషు పుస్తకప్రతులు-8, 17. "మండువా లోగిలి" అన్న నవల ప్రతులు-4.

ఈ వస్తువులన్ని కరతాళధ్వనుల మధ్య పరమానందంతో తెలుగు ప్రజలు స్వీకరించారు. తరువాత శ్రీ కృష్ణారావుగారు ఇతర రాష్ట్రాలకు, ఇతర దేశాలకు తెలుగు ప్రజలు ఏ పరిస్థితుల్లో వెళ్లవలసి వచ్చినదీ వివరించి ఈ నాటికి తెలుగు భాషను, తెలుగు సంస్కృతిని రక్షించుకొంటూ వస్తున్నందుకు వారిని అభినందించారు. మారిషస్ ప్రభుత్వంవారు తెలుగుభాషకు చేస్తున్న సహాయానికి ధన్యవాదాలు సమర్పించారు. మారిషస్‌లో గల తెలుగు వారికి అవసరమైన సహాయం చేసేందుకు మారిషస్ ప్రభుత్వం, భారత ప్రభుత్వం, రెండిటి సహకారంతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పూను కొనగలదని వాగ్దానంచేసి తెలుగు భాష మాట్లాడినప్పుడే తెలుగుతనం నిలుస్తుందని, మారిషస్‌లోగల తెలుగువారంతా తెలుగు మాట్లాడి, తమ పిల్లలను తెలుగు నేర్చుకొనేందుకు స్కూళ్లకు పంపమని తద్వారా తెలుగు సంస్కృతిని రక్షించుకోమని కోరారు. భారత హైకమీ షనరు శ్రీ ఖురానా తెలుగువారికి అవసరమైన సహాయం చేసేందుకు భారత హైకమీషనరుగా తమ సంసిద్ధతను వెల్లడించారు ఆ రోజున జరిగిన కార్యక్రమమంతా టెలివిజన్‌ద్వారా ప్రసారం చేయబడింది. దానితో మారిషస్ దేశంలో తెలుగు ప్రజలకు

సంబంధించిన వార్తలు ప్రచారం బాగా జరిగింది. తెలుగు ప్రజల్లో గొప్ప ప్రచారం జరిగింది. తత్ఫలితంగా శ్రీ కృష్ణారావుగారికి తీరిక లేని కార్యక్రమాలు ఏర్పాటు చేయబడ్డాయి. ఆరోజు రాత్రి తెలుగు ప్రముఖుల గృహంలో శ్రీ కృష్ణారావు గారి గౌరవార్థం విందు జరిగింది చాలా మంది తెలుగు వారు ఆ విందులో పాల్గొన్నారు. రాత్రిబాగా ప్రొద్దు పోయిందాకా భోజన కార్యక్రమం జరిగింది. ఆగృహంలోని స్త్రీలు విశాఖపట్టణానికి చెందినవారు. శ్రీ కృష్ణారావు గారిని, వారి బృందాన్ని ఇంట్లోకి తీసుకొని వెళ్లి బంధువులు వచ్చి నట్లుగా ఆదరించి ఇల్లంతా చూపించడమే గాక వారి పూర్వీకుల కష్టసుఖాలు తెలుగులో చెప్పి ఆనందపడ్డారు. ఇక్కడ స్త్రీలు, పురుషులు తెలుగులో మాట్లాడుతూ ఉంటే దానిని ఆంధ్రప్రదేశ్ లో ఉన్న తెలుగు వారికి వినిపించేందుకు ఎప్పటికప్పుడు టేపు చేయించారు. కొందరిని ప్రశ్నలు వేసి సమాధానాలు తెలుగులో పొందారు. ప్రతివారితో తెలుగులో మాట్లాడటం, వారిచేత కూడా తెలుగులోనే మాట్లాడించడం, తెలుగు వాతావరణం సృష్టించడం కృష్ణారావుగారు లక్ష్యంగా పెట్టుకొన్నారు. చాలావరకు తమ లక్ష్యసాధనకు వారు కృషిచేశారు. ఆరాత్రికి విలేజీ హోటల్ నుండి సామాను తెప్పించాము. పోర్టులూయిస్‌లో అంబాసిడర్ హోటల్లో ఆనాటి నుండి మకాం ఏర్పాటు అయింది. ఉదయం 8-30 గంటలకు బయలు దేరడం, రాత్రి 11-00 గంటలకు హోటలుకు చేరు కోవడం—ఇది మారిషస్‌లో నిత్యకార్యక్రమం.

*ప్రభుత్వ ప్రధాన కార్యాలయంలో*

ది 25-8-1976 బుధవారం నుండి శ్రీ కృష్ణారావుగారి కార్యక్రమం ముమ్మరంగా ప్రారంభమైంది. అనుకొన్న ప్రకారం ఉదయం 9-00 గంటలకు శ్రీ పుష్పరాజ్ సూరయ్య, డ్రైవరు మాకే, కారులో అంబాసిడర్ హోటలుకు వచ్చారు. హైదరాబాదు

నుండి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, అంతర్జాతీయ తెలుగు సంస్థ పక్షాన తీసుకొని వచ్చిన అజంతా చిత్ర ఫలకాలు, ప్రపంచ తెలుగు మహా సభల సందర్భంలో ప్రకటించిన "తెలుగు వాణి" అను హిందీ సావ నీరు ప్రతులు వెంటబెట్టుకొని మారిషస్ ప్రభుత్వ ప్రధాన కార్యా లయం చేరుకొన్నాం. ముందుగానే ప్రధానమంత్రిని, ఆర్థికశాఖా మంత్రిని, విద్యాశాఖా మంత్రిని, యువజన, క్రీడాశాఖా మంత్రిని, పార్లమెంటు సెక్రటరీని, భారత హైకమీషనరును వారి వారి కార్యా లయాలలో కలుసుకొనుటకు నిర్ణయం జరిగింది. ప్రధాని సర్ శివ సాగర్ రామ్‌గులాం ఆఫీసు చేరుకొనేసరికి సరిగ్గా 10-30 అయింది. వారు స్వయంగా ద్వారం దగ్గరకు వచ్చి స్వాగతం చెప్పారు. అదే సమయానికి భారత హైకమీషనర్ ఎం. ఎం. ఖురానా కూడ అక్క డికి వచ్చారు. శ్రీ కృష్ణారావుగారితోబాటు నేను, మారిషస్‌లో తెలుగు విద్యాశాఖాధికారిగా నియమింపబడిన డాక్టర్ వేటూరి ఆనందమూర్తి, మారిషస్ వాసి పుష్పరాజ్ సూరయ్యా, అక్కడ టెలివిజన్ శాఖలో పనిచేస్తున్న చిన్నయ్యస్వామి వున్నాం. ప్రధాని కార్యాలయం ఆర్భాటాలుగాని, హంగామాలు గాని ఏమీ లేకుండా గంభీరంగాను, హుందాగాను, నిరాడంబరంగాను వున్నది హైద రాబాదు నుండి నానా శ్రమ పడి విమానాల్లో దెబ్బతినకుండా ప్రత్యే కించి జాగ్రత్తగా పట్టుకొని తీసుకొని వెళ్ళిన పెద్ద అజంతా చిత్ర ఫలకాన్ని, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పక్షాన శ్రీ కృష్ణారావుగారు సర్ శివసాగర్ రామ్‌గులాంగారికి అందజేశారు. అక్కడ జరిగిన కార్యక్రమమంతా టెలివిజన్ ద్వారా ఆ సాయంత్రం మారిషస్ దేశమంతటా ప్రసారం చేయబడింది. ఎంతో ఆప్యాయతతో సగౌర వంగా అందరినీ పలుకరిస్తూ భారతదేశాన్ని గురించి, ఆంధ్రప్రదేశ్‌ను గురించి, మారిషస్ తెలుగు ప్రజల్ని గురించి సద్భావం వెల్లడిస్తున్న సర్ శివసాగర్ రామ్‌గులామ్‌ను చూస్తుంటే ఎట్టివారికైనా పూజ్య



శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు హైదరాబాదు నుండి తెచ్చిన అజంతా చిత్రసుందరి ఫలకం సర్ శివసాగర్ రామ్‌గులామ్ గారికి బహూకరిస్తున్న దృశ్యం. ఇందు శ్రీయుతులు కృష్ణారావుగారు, రాధాకృష్ణమూర్తి, సూరయ్య, ఖురానా శివసాగర్ రామ్‌గులామ్ గారలు ఉన్నారు.



మారిషస్ ప్రధాని సర్ శివసాగర్ రామ్‌గులామ్‌ను వారి కార్యాలయంలో శ్రీ కృష్ణారావుగారు కలుసుకొన్నప్పుడు తీయబడిన ఛాయాచిత్రం. భారత హైకమీషనర్ ఖురానా, రామ్‌గులామ్, కృష్ణారావుగారు, రాధాకృష్ణమూర్తి మారిషస్ టెలివిజన్ తెలుగు అధికారి ఇందులో ఉన్నారు.

భావం ఏర్పడితీరుతుంది. "తెలుగు వాణి" అను హిందీ సావనీరును వారికి అందజేసి దాని వివరం చెబితే సంతోషంతో అందుకొని తమ కార్యదర్శికి 'భద్రంగా వుంచి, ఫలానా సమయంలో తనకు ఇమ్మని' చెప్పారు. వారి కార్యాలయంలో విశిష్ట అతిథుల చేత సంతకాలు చేయించే విజిటర్సు పుస్తకం ఒకటి ఉన్నది. వారి కార్యదర్శిని శ్రీ వెంకటకృష్ణారావుగారి చేత ఆ పుస్తకం మీద సంతకం చేయించు కొని వెళ్లింది. ఇది గమనించిన ప్రధాని తాను లేచివెళ్లి తమ కార్య దర్శికి చెప్పి విజిటర్స్ బుక్కును నా దగ్గరకు పంపించారు. కృత జ్ఞతాభావంతో అందుకొని దానిలో సంతకం చేశాను. తరువాత డాక్టర్ వేటూరి ఆనందమూర్తిగారు కూడా దానిలో సంతకం చేశారు. ఆ పుస్తకంలో పేరు, పదవి, దేశం పేరు, చిరునామా వ్రాసి సంతకం చేయవలసి ఉంటుంది. శ్రీ మండలి వెంకటకృష్ణా రావుగారు మారిషస్ ప్రభుత్వానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ముఖ్య మంత్రి గౌరవనీయులు జలగం వెంగళరావుగారి తరఫున, తెలుగు ప్రజల తరఫున శుభాకాంక్షలు అందజేసి, మారిషస్ దేశంలో భారతీయ భాషల విషయంలోను, ముఖ్యంగా తెలుగు విషయం లోను, తెలుగువారి విషయంలోను, వారు చూపుతున్న ఆదరణకు, ఉదార హృదయంతో తెలుగు భాషాబోధనకై చేసిన ఏర్పాట్లకు ధన్యవాదాలు సమర్పించారు. భారత ప్రభుత్వం సహాయంతో, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మారిషస్‌లో గల 50 వేల మంది తెలుగు ప్రజలకు వారి అనుమతి, ఆశీస్సులతో అవసరమైన సాంస్కృతిక పరమైన సహాయం చేయగలదని చెప్పారు. సర్ శివసాగర్ రామ్ గులాం మారిషస్ తెలుగు ప్రజలు తమ ప్రభుత్వానికి అందజేస్తున్న సహకారాన్ని శ్లాఘించి, వారు చేస్తున్న కృషిని అభినందించి వారికి తమ ప్రభుత్వం పక్షాన అవసరమైన సహాయం తప్పక అందజేయ గలమని అన్నారు. మహాత్మాగాంధి సంస్థాన్‌లో ఇతర భాషలలో

పాటు తెలుగును కూడా చేర్చవలెనని శ్రీ కృష్ణారావుగారు చెప్పగా వెంటనే అంగీకరించారు. భారత హైకమీషనర్ ఖురానా యీ విషయమై తాము శ్రద్ధ వహించి పనిచేయగలమని చెప్పారు. గాంధి సంస్థాన్‌లో ప్రతి సంవత్సరం ఇంగ్లీషు, ఫ్రెంచి, హిందీ, తమిళ భాషలలో ప్రభుత్వ స్థాయిలో జరుగుతున్న నాటక ప్రదర్శనల కార్యక్రమమునందు యీ సంవత్సరాన్నుంచి తెలుగుకు కూడా ప్రవేశం కల్పించామని సర్ శివసాగర్ రామ్‌గులాం చెప్పారు. శ్రీ వేటూరి ఆనందమూర్తిగారు మారిషస్‌లో తెలుగు భాషా ప్రగతికి కృషి చేయగలరని ఆశిస్తున్నామని కూడా అన్నారు. ఈ కార్యక్రమం పూర్తి అయేసరికి అరగంటకుపైగా పట్టింది. ద్వితీయ ప్రపంచ హిందీ మహాసభల్లో పాల్గొనేందుకై వచ్చినా అవి ప్రారంభమయ్యేలోపున 25, 26, 27 తేదీలలో మారిషస్‌లోగల తెలుగువారిని, తెలుగు బోధిస్తున్న పాఠశాలల్ని, తెలుగు ఉపాధ్యాయుల్ని, బాలబాలికల్ని చూస్తామని శ్రీ కృష్ణారావుగారు చెప్పినప్పుడు సర్ రామ్‌గులాం ఎంతో ఆనందించారు. ది. 24-8-76 నాటి సాయంత్రం మారిషస్ ఆంధ్ర మహాసభా భవనంలో జరిగిన తెలుగువారి సభను గురించి, తెలుగు వారు చూపిన ఉత్సాహాన్ని గురించి భారత హైకమీషనర్ ఖురానా ప్రధానికి తెలియజేశారు. సర్ రామ్‌గులాం ద్వారందాకా వచ్చి సుహృద్భావ వాతావరణంలో వీడ్కోలు చెప్పారు.

*ప్రధాన మంత్రి : సర్ శివసాగర్ రామ్‌గులాం*

సర్ శివసాగర్ రామ్‌గులాం మారిషస్ దేశానికి ప్రధాన మంత్రి. వారు నియమ ప్రకారం ప్రతిరోజూ తమ ఆఫీసుకు వచ్చి ప్రభుత్వ కార్యక్రమాలు నిర్వహించుకొంటారు. వారి ఆఫీసు బయట పోలీసుల ఆర్భాటంగాని, హంగామాగాని అంతగా లేదు.



మారిషస్‌లో దీ. 27-8-76 నాడు భారత హైకమీషనరు ఇచ్చిన విందు సందర్భంలో శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు భారత ప్రతినిధివర్గ నాయకులు డా॥ కరన్‌సింగ్‌తో ముచ్చటిస్తున్న దృశ్యం.



ద్వితీయ ప్రపంచ హిందీ మహాసభల వేదికపై ప్రథమ పంక్తిలో కూర్చున్న శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు, వారికి కుడిప్రక్కన శ్రీ సుధాకర్ పాండే ఎడమప్రక్కన ఫ్రెంచి ప్రతినిధి, శ్రీమతి డా॥ కరన్‌సింగ్, సర్ శివసాగర్ రామ్‌గులామ్, డా॥ కరన్‌సింగ్ గారలు ఉన్నారు.

చాలా కొద్ది మంది మాత్రమే రక్షకభటులు అక్కడక్కడ నిలబడి తమ కర్తవ్యాన్ని నెరవేరుస్తున్నారు.

మారిషస్ దేశచరిత్రతో భారతీయుల జీవితం ముడిపడివున్నది. వారి నాయకుడుగా సర్ శివసాగర్ రామ్‌గులాం మారిషస్ దేశ చరిత్రలో నూతనాధ్యాయం ప్రారంభించారు. బానిసలుగాను, కూలీలుగాను సంవత్సరాల తరబడి ఫ్రెంచివారి చేతుల్లోను, ఇంగ్లీషు వారి చేతుల్లోను పడి నానా యాతనలననుభవించిన భారతీయులను ఆ దేశ పరిపాలకులుగా తీర్చిదిద్దారు. ఈ నాడు మారిషస్ దేశపు ప్రధాన పౌరులుగా భారతీయులు పరిగణింపబడటమేగాక ఆ దేశ కీర్తిప్రతిష్టలను ప్రపంచమందంతట వ్యాప్తంచేస్తున్నారు.

1900 సెప్టెంబరు 14వ తేదీన మారిషస్ ద్వీపంలో ఒక కొండ ప్రాంతంలోగల బెల్ రీవ్ అను కుగ్రామంలో శ్రీ శివసాగర్ చిన్ని గుడిసెలో జన్మించారు. వారిది బీహార్ ప్రాంతాన్నుండి మారిషస్ వెళ్లిన భోజపురి మాట్లాడే బీద కుటుంబం. చిన్నప్పుడు ఆ గ్రామ ప్రజలు ముద్దుగా శివసాగర్‌ను కేవలా (ముంగిస) అని పిలిచేవారు. వారి చిన్నతనంలో భారతీయులు పశువుల్లా జీవిస్తూ రాత్రింబవళ్లు పొలాల్లో పనిచేస్తూ వుండేవారు. శివసాగర్ తండ్రి, వారి అన్నగారలు కూలి పనిచేస్తూ ఇతర కూలీలచేత కూడా పనిచేయిస్తూ వుండేవారు. వారికి ఒక ఆవు వుండేది. రోజూపచ్చగడ్డి కోసుకురావడం, ఆవుకు మేపడం, ఆవు యిచ్చిన పాలు తీసుకొని వెళ్లి అమ్ముకురావడం శివసాగర్ పని. చిన్నతనంలో చదువు మీద ధ్యాస వుండేది. కాని ఇంటి పనులు ఎక్కువగా వున్నందున చదువు విషయం ఎవ్వరూ పట్టించుకోలేదు. ఒక రోజున ఇంట్లో ఎవ్వరికీ చెప్పకుండా పిల్లలతో కలిసి బడికి వెళ్లి సాయంత్రం భయపడుతూ వచ్చి ఇంట్లో అడుగు పెట్టేసరికి తల్లి, తండ్రి, అన్నగారలు కంగారు పడుతూ కనబడ్డారు. బడికి వెళ్లానని చెప్పేసరికి అంతా సంతోషించి వెంటనే పలక ఒకటి

కొని ఇచ్చారు. అప్పటి నుండి స్కూలు చదువు ప్రారంభమైంది 7వ ఏటనే శివసాగర్ తండ్రి గతించాడు. ఒక రోజున ఆవు గట్టిగా పొడిచింది. దాని కొమ్ము గుచ్చుకొని శివసాగర్ ఎడమ కన్ను బాగా దెబ్బతినిపోయింది. ఆ దెబ్బ యిప్పటికీ సర్ శివసాగర్ ఎడమ కంట్లో కనబడుతుంది. అన్నగారు శ్రద్ధవహించి తమ్ముడికి చదువు చెప్పించాడు. డాక్టరీ చదువు నిమిత్తం ప్రోత్సహించి తమ్ముణ్ణి ఇంగ్లండుకు పంపించాడు. 14 సంవత్సరాలు ఇంగ్లండులో వుండి చదివి శివసాగర్ డాక్టరు పట్టా పుచ్చుకొన్నారు. చిన్నప్పటి నుండి తులసీరామాయణమంటే ఎక్కువ ఇష్టం. వాళ్ల ఇంట్లో తులసీ రామాయణపారాయణం జరుగుతూ వుంటే శివసాగర్ డోలక్ వాయించేవారు. ఇంగ్లండులో చదువుకొన్నప్పుడు అనేకమంది భారతీయ స్వాతంత్ర్య యోధులతో వారికిపరిచయం కలిగింది ముఖ్యంగా లాలా లజపతిరాయ్ ప్రభావం శివసాగర్ మీద అమితంగా పడింది. ఘనా దేశనాయకుడు క్వామేఎన్‌క్రూమాతో ఇక్కడే స్నేహం ఏర్పడింది. 1932లో రౌండు టేబుల్ కాన్ఫరెన్సుకు లండను వచ్చినప్పుడు మహాత్మాగాంధీని, రైట్ ఆనరబుల్ శ్రీనివాస శాస్త్రిని శ్రీ శివసాగర్ కలుసుకొని వలసదేశాల విమోచనోద్యమాన్ని గురించి దీర్ఘంగా చర్చించారు. ఇంగ్లండులోగల జిమీమాక్ట్సన్, జార్జి లాంస్బరి వంటి కార్మికనాయకుల సాంగత్యం వారికి లభించింది. లాంస్బరీ శివసాగర్‌ను అమితంగా ప్రోత్సహించడమే గాక, రాజకీయ, సాహిత్య కళారంగాలకు సంబంధించిన గొప్ప వ్యక్తులతో శివసాగర్‌ను పరిచయం చేశాడు. అప్పటి నుండి చదువుతోబాటు, రాజకీయ, సాంఘిక సాంస్కృతిక రంగాలలో కూడా శివసాగర్ మంచి అనుభవం గడించారు. గాంధిమార్క్సు సిద్ధాంతాల ప్రభావం వారి మీద ఎక్కువగా పడింది. రక్తపాతం లేకుండా సమానత్వం సాధించాలని, జన్మత: మనిషి దోషి అని భావించడం తప్పని, మనుష్యుల్ని మంచిమార్గానికి

మరల్చవచ్చునని వారికి గాఢంగా నమ్మకం ఏర్పడింది. ఈ విధమైన రాజకీయ చైతన్యం, దృఢమైన సిద్ధాంతాలతో శివసాగర్ 1935లో మారిషస్ చేరుకొన్నారు. స్వాతంత్ర్య సముపార్జనకు రథసారథియై ప్రధాని పదవిని అలంకరించారు

*మారిషస్ భౌగోళిక స్వరూపం*

మారిషస్ దీవి హిందూమహాసముద్రం నైఋతి తీరానికి సుమారు 1250 మైళ్ల దూరాన మకరరేఖపై వున్నది. ఈ దీవి సుమారు 40 మైళ్ళ పొడవు 30 మైళ్ళ వెడల్పుగా వ్యాపించి 720 చదరపు మైళ్ళు విస్తీర్ణం కలిగియున్నది ఈ ద్వీపం ఆఫ్రికా ఖండానికి సమీపాన నున్న మెడగాస్కర్ ద్వీపానికి 500 మైళ్ళ దగ్గరలో వున్నది. దీని సముద్రతీరం కొలత 140 మైళ్లు. ఈ దేశానికి రాజధాని నగరం పోర్టులూయీ. ఈ పట్టణమే ఈ ద్వీపపు ఓడరేవు. ప్రభుత్వ కార్యాలయాలు, పార్లమెంటు భవనం ఈ పట్టణంలోనే ఉన్నాయి. బోబాస్, క్యాత్‌బోర్న్, వాక్వా, మోకా, క్యూపివ్, మాహేబర్గ్ మారిషస్ దేశంలోగల పెద్ద పట్టణాలు. ఇవి గాక చాలా గ్రామాలు వున్నాయి. సమస్త సౌకర్యాలు కలిగి, ఫ్రెంచి సంస్కృతి ప్రభావం ప్రతి చిన్న విషయంలోను స్పష్టంగా కనిపించే అక్కడి గ్రామాలు కూడా పట్టణాలతో సమానంగానే వున్నాయి. ఈ దేశంలో ప్రకృతి సౌందర్యం అపారం అందువల్లనే ఈ ద్వీపం హిందూమహాసముద్రపు ముత్యమని ప్రసిద్ధికెక్కింది. అగ్నిపర్వతం బద్దలై ఈ ద్వీపం ఏర్పడిందని, అందువల్లనే ఇక్కడి భూమి సారవంతమైనదని ప్రతీతి. ఈ ద్వీపంలో కొద్దికొద్ది దూరాన వాతావరణం మారిపోతూ వుంటుంది. మూపు బాగాఎదిగిన తాబేలు ఆకారంలో ఈ ద్వీపం వుంటుంది. అందువలన ఈ దేశపు మధ్యభాగం ఎత్తుగా వుంటుంది దక్షిణాన వర్షం ఎక్కువగా కురుస్తుంది. ఉత్తర దిక్కున తక్కువ. ప్రతిరోజూ ఏదో ఒకచోట వర్షం పడుతూనే వుంటుంది.

మొత్తం మీద ఎండలు ఎక్కువగా వుండవు. ఆకాశం ఇంద్రధనస్సు రంగులతో అందంగా కనబడుతూ వుంటుంది. అందమైన సముద్ర తీరాలు ఎక్కువ. సముద్ర తీరానికి కొద్ది దూరాన పర్వతపు రాళ్లు గుట్టలు గుట్టలుగా పడి అడ్డుగోడగా ఏర్పడి వుండటంవలన పెద్దపెద్ద అలల వేగం అక్కడే ఆగిపోతుంది అందువలన స్నానాలు చేసే వారికి అనుకూలంగా వుంటుంది. శనివారం, ఆదివారాలలో విలాస యాత్రీకులు ముఖ్యంగా విదేశీయులు ఎక్కువగా స్నానాల నిమిత్తం అక్కడకు వస్తూవుంటారు. సముద్రంలో విహరించేందుకు ఏర్పాట్లన్నీ అక్కడ చేయబడ్డాయి. వాయవ్య దిశన పాయింటోపిమా, త్రుటబీచ్, మోప్వాజీ, గ్రాంబె, పెరేబెర్, పడమర దిక్కున ఫిలక్ ఆఫ్లాక్, తామారే, దక్షిణాన గ్రీగ్రీ (ఇక్కడ స్నానాలు చేయడం నిషేధించబడినవి), ఆగ్నేయ దిశన బ్లూబే, తూర్పున బెల్ మార్ అను సముద్ర తీరాలు ఇక్కడ వున్నాయి. మారిషస్ ద్వీపంలో తటాకాలు, సరస్సులు, జలపాతాలు ఎక్కువగా వున్నాయి. వాటిలో లానికోలియేర్, లాఫెర్మ్, మారోటవాక్వా, మార్లోంగ్, ఒపే, గ్రాబాసె (గంగా సరస్సు) అనునవి పేర్కొనతగినవి. ఆ దేశంలో ఎక్కడా రైళ్ళులేవు. ఫ్రెంచి పరిపాలకుల సమయంలో రైళ్ళు నడిచేవి. కాని ఆ తరువాత వాటిని తొలగించివేసి వాటి స్థానే బస్సుల్ని ప్రవేశపెట్టారు. ఎక్కడచూచినా పచ్చని చెట్లు, పూల మొక్కలు, భారతదేశంలో దొరికే కూరగాయలన్నీ మారిషస్ దేశంలో దొరుకుతాయి. మునగ చెట్లుకూడా వున్నాయి. వంగ మొక్కలు మనిషి ఎత్తున ఉంటాయి. దేవదారు చెట్లవంటి చెట్లు విపరీతంగా దేశమందంతటా వున్నాయి. చెరుకుపంట పదిసంవత్సరాల వరకు వుండటం అక్కడి విశేషం. ప్రతి కుటుంబానికి సగటున ఒక్కొక్క ఇల్లు వున్నది. ప్రతి కుటుంబానికీ ఒక్కొక్క కారు. రకరకాల మోడళ్లలో వేలాది కార్లు అమితవేగంతో నిగనిగలాడే

తారురోడ్ల మీద తిరుగుతూ వుంటాయి. ఆ తారు రోడ్లకు మధ్యగా వెలుగులో మిలమిల మెరిసిపోతూ వెలుగుతూవున్న బల్బుల్లా కాంతిని విరజిమ్ముతూ వుండే ఒక రకమైన రాతి ముక్కలు వరుసగా ఒక గీటువలె అమర్చబడివుంటాయి. పగలు అవి కనబడవు కాని రాత్రిళ్లు ఎంతో అందంగా బల్బుల తోరణాల్లా వాహనాలను అదుపులో పెడుతూవుంటాయి. కుక్కలు, కోళ్లు, ఆవులు అక్కడ వున్నాయి. కాని రోడ్లమీద యథేచ్ఛగా తిరుగుతూ కనబడవు. కాకులు గాని, గ్రద్దలుగాని, గేదెలుగాని, పాములుగాని అక్కడ కనపడలేదు. పర్వతాలు, చెట్లు, చేమలు, అడవులు, చెరుకు తోటలు విస్తారంగా గల ఆ దేశంలో విషసర్పాలు లేకపోవడం-అక్కడి ప్రజలు బొమ్మల్లోను, సినిమాలలోను చూడటమేతప్ప ప్రత్యక్షంగా వాటిని చూడక పోవడం-ఆశ్చర్యకరమైన విషయమే. ఆవుపాలు కొన్ని ఇళ్లలోనే త్రాగేందుకు దొరుకుతాయి. సామాన్యంగా ఆ దేశంలో పాలు దొరకవు. కాఫీలు, టీలు మొదలుగాగల వాటికి వాడేవన్నీ డబ్బా పాలే. లేక పాలపొడికి సంబంధించిన పాలే. అందువల్ల అక్కడ తెలుగువారికి పెరుగు, మజ్జిగ, మంచి నెయ్యి దొరకవు. ఆ పేర్లతో ఏవో వస్తువులు దొరికినా తెలుగువారి నోటికి రుచించవు. ప్రతి పొలంలోను సారవంతమైన మట్టితోబాటు బండరాళ్ళగుట్ట ఒకటి ఎత్తుగా కనబడుతుంది. భారతదేశాన్నుండి మారిషస్ ద్వీపం వెళ్ళిన లక్షలాది భారతీయ కూలీలు అక్కడి బంజరుభూముల్ని సరిచేసి అడ్డువచ్చిన బండరాళ్ళనన్నింటిని గుట్టలుగా ఒక చోట చేర్చి పొలాల్ని సారవంతం కావించారనీ, ఆ మట్టి భారతీయుల చెమట, రక్తంతోను తడిసి సారవంతమైనదనీ, వాళ్లుపడిన కష్టాలకు ఫ్రెంచి వారి చేతులలోను, ఇంగ్లీషు పరిపాలకుల చేతులలోను, వాళ్లు అనుభవించిన యమయాతనలకు ఆ బండరాళ్ళ గుట్టలు సాక్ష్యాలని అక్కడి ప్రజలు చెబుతారు. ఆ పొలాలు, ఆ బండరాళ్ళ గుట్టలు

కవితా వస్తువులుగా ఉపయోగపడ్డాయనిచెప్పి ఆ కవితల్ని వినిపిం చేందుకు అక్కడి ప్రజలు సిద్ధపడతారు. ఆ గుట్టల దగ్గరకుచేరి వాటిని ఆనుకొని హిందీభాష మాట్లాడే కూలీలు తులసీరామాయణం, తెలుగుభాష మాట్లాడే కూలీలు రామభజన, కృష్ణభజన, మరాఠీ, ఉర్దూ, తమిళం మొదలుగా గల భాషలు మాట్లాడే కూలీలు ఆయా భాషలలో భజనలు చేసుకొంటూ పూర్వకాలంలో తమ సంస్కృతిని రక్షించుకొంటూ వుండేవారని కూడా అక్కడి ప్రజలు సగర్వంగా చెబుతారు.

*మారిషస్ ద్వీపంలో తొలివెలుగు*

1505 లో అరబ్ నావికులు ఈ ద్వీపాన్ని కనుగొన్నారే గాని వారు అక్కడ నివసించలేదు. 1599 లో పోర్చుగీసు నావికులు యీ ప్రాంతాన్ని కనుగొన్నప్పటికీ వారు దీనిని ఆక్రమించు కొనలేదు. నాస్యూ అధినేత ప్రిన్స్ మారిషస్ పేరిట దీనికి మారిషస్ అని పేరు వచ్చింద. ఆ తరువాత డచ్చివారు ఈ ప్రాంతాన్ని ఆక్రమించు కొన్నారే గాని ఏమీ లాభం కలుగనందున వారు ఎక్కువ రోజులు వుండలేదు. 1715 లో ఫ్రెంచి వారు ఈ ద్వీపాన్ని వాసయోగ్యంగా చేయడమేగాక ఎంతో అభివృద్ధికి తెచ్చారు. ఓడరేవును నిర్మించారు. పట్టణాల నిర్మాణం కూడా చేశారు. మెడగాస్కర్ నుంచి, ఆఫ్రికా దేశాల నుంచి బానిసలను తెచ్చి చెరకును పండించడం ప్రారంభించారు. లవంగాలు, ప్రత్తి మొదలైన ఇతర పంటలను కూడా పండించారు. సుమారు 100 సంవత్సరాలు ఫ్రెంచి వారు మారిషస్‌ను పరిపాలించారు. తత్ఫలితంగా ఈ దీవిలో క్రైస్తవ మతం బాగా వ్యాప్తమైంది. ప్రజలపై ఫ్రెంచి భాషా సంస్కృతుల ప్రభావం విపరీతంగా పడింది. పుదుచ్చేరి, బెంగాల్ ల నుండి పెక్కుమంది భారతీయుల్ని తీసుకువెళ్లారు. మహమ్మదీయులు కూడా ఆకాలంలోనే ఎక్కువగా అక్కడకు వెళ్లారు. ఆ సమయంలో

సామ్రాజ్య విస్తరణకోసం ఫ్రెంచి వారికీ, ఇంగ్లీషు వారికి యుద్ధాలు జరుగుతూ వుండేవి. మారిషస్‌ను ప్రధాన కేంద్రంగా పెట్టుకొని ఫ్రెంచివారు సామ్రాజ్య విస్తరణకు కృషిచేస్తూ వుండేవారు. దానితో ఇంగ్లీషువారు హిందూ మహాసముద్రంలో ఫ్రెంచి పాలన క్రిందగల ద్వీపాలనన్నింటినీ ఆక్రమించుకోవాలనే నిర్ణయానికి వచ్చి, మద్రాసు, లంక, బెంగాలు, బొంబాయిలకు చెందిన వేలాది యువకులతో పటాలాలు తయారుచేసి వారి సహాయంతో మారిషస్ మీద దాడి చేసి విజయం సాధించారు. 1810 నుండి మారిషస్‌లో ఇంగ్లీషు వారి పరిపాలన ప్రారంభమైంది. అయితే మారిషస్‌లోగల ఫ్రెంచి భాషా సంస్కృతుల జోలికి పోకూడదని ఆంగ్లప్రభుత్వం నిర్ణయించుకొన్నది. ఇంగ్లీషు వారి కాలంలో విశాఖ, తూర్పు గోదావరి జిల్లాల నుండి కోరంగి అను రేవు ద్వారా తెలుగు ప్రజల్ని మారిషస్ చేర్చడం జరిగింది. పుదుచ్చేరి, బీహారు, బెంగాలులకు చెందిన జనాన్ని కూడా విపరీతంగా మారిషస్ చేర్చి వారిచేత వ్యవసాయం చేయించారు. వారంతా కూలీలుగానే పరిగణింపబడేవారు. చైనా నుండి కూడా జనాన్ని అక్కడికి చేర్చారు. ఆ రోజుల్లో ఆశలుచూపి ఆంగ్ల ప్రభుత్వాధికారులు, మధ్యదళారులు, మభ్యపెట్టి జనాన్ని మారిషస్ చేర్చారు. అక్కడకు చేరిన తరువాత వాళ్లను నానా హింసలు పెట్టి వారిచేత కాయకష్టం చేయించేవారు. ఆంగ్లేయుల పరిపాలనా సమయంలో మారిషస్‌లో ఆంగ్ల గవర్నరు పరిపాలన సాగిస్తూ వుండేవాడు. దేశమందంతటా తెల్ల జమీందార్లు ఎక్కువగా వుండేవారు. వాళ్ళంతా భారతీయ కూలీల చేత పనులు చేయిస్తూ వుండేవారు. ఎంతోమంది రాత్రింబవళ్లు పని చేసి చేసి తట్టుకోలేక చనిపోయేవారు. ఆ దేశాన్ని సారవంతం చేసి పంటలు పండించి యిచ్చిన భారతీయులు కూలీలుగా అక్కడ బ్రతకవలసి వచ్చింది. క్రమంగా భారతీయులు ఎదురు తిరగడం ప్రారంభించారు. దానితో తెల్లవారికీ,

భారతీయులకు సంఘర్షణ ప్రారంభమైనది. ఈ సంఘర్షణ సంవత్సరాల తరబడి సాగింది. మారిషస్‌లో భారతీయులపై జరుగుతున్న ఘోరాలు బయటికి రాసాగాయి. ఇంగ్లండులోను, భారత దేశంలో కూడా ఇటు ప్రజల్లోను, పత్రికల్లోను, అటు పార్లమెంటులోను చర్చలు ప్రారంభమైనాయి. ఆంగ్ల ప్రభుత్వం పక్షాన అనేక కమిటీలు ఏర్పడటం, విచారణ జరగడం, నివేదికలు సమర్పించబడటం జరిగిందే కాని అక్కడి భారతీయులకు ప్రయోజనం ఏమీ కలుగలేదు. జీవిత విధానంలో కొద్దిమార్పులు తప్ప వారికి అధికారాలేమీ సంక్రమించలేదు. అక్కడ నివసించే సామాన్య జనంలో క్రియోల్ అను భాష ప్రచారంలోకి వచ్చింది. ఇది ఫ్రెంచి మొదలుగా గల భాషల అపభ్రంశం. దీనికి ఇప్పటికీ లిపిలేదు. కాని మారిషస్‌లో వుండే ప్రతివారికీ యీ భాష తెలుసు. తెలుగు వాళ్లు దీన్ని కొండ భాష అని అంటారు.

*మహాత్మాగాంధి పర్యటన: స్వాతంత్ర్య సమరబీజాలు*

ఆ రోజుల్లో మహాత్మాగాంధీ దక్షిణ ఆఫ్రికాలో వుండేవారు. అక్కడ మహాత్ముడు సహాయ నిరాకరణోద్యమాలు, సత్యాగ్రహాలు నడిపించినప్పుడు మారిషస్ నివాసి తంబినాయుడు ధైర్యసాహసాలతో ముందుకు వచ్చి మహాత్మునికి సహకరించాడు. అతడివల్ల మహాత్మునికి మారిషస్ ప్రజల కష్టగాథ తెలిసింది. తంబినాయుడు అంటే గాంధీకి అమిత గౌరవం. 1901లో మహాత్ముడు మారిషస్ చేరుకొని ఆ దేశమంతా పర్యటించి చూచారు. పోర్టు లూయిస్‌లో మహాత్మునికి ఘనమైన స్వాగతం లభించింది. మహాత్ముడు భారతీయ భాషల్ని ఉపయోగించమని, స్వభాషాభిమానం పెంచుకోమని, బయటి వారి మీద ఆధారపడకుండా స్వశక్తితో కష్టాలను ఎదుర్కోవలెనని అక్కడి భారతీయులకు బోధించారు. గాంధీ చేసిన ప్రసంగాల్ని అక్కడి ఆంగ్ల పత్రికలు తీవ్రంగా విమర్శించాయి. మహాత్ముడు

మారిషస్‌లో 21 రోజులు వుండి భారతీయుల్లో గొప్ప చైతన్యం తీసుకొని వచ్చారు వారి పర్యటనవలన, వారి బోధలవలన భారతీయులకు ధైర్యం కలిగింది.

మారిషస్‌లో వున్నప్పుడు ఒక రాత్రి సంస్కృత భాషా పండితుడు, అక్కడి గవర్నరగు సర్ చార్ల్స్‌బ్రూస్ ఇచ్చిన ఆతిథ్యం మహాత్ముడు స్వీకరించారు. సర్ బ్రూస్ బ్రిటిష్ సామ్రాజ్యంలో వున్న భారతీయుల రాజకీయ ఆకాంక్షల యెడ సానుభూతి కలిగి వుండేవాడు. 1901 డిశంబరు 1వ తేదీన మహాత్ముడు భారతదేశం చేరుకొని కలకత్తాలో జరిగిన అఖిల భారత కాంగ్రెసుకు మారిషస్ ప్రజల పరిస్థితిని గురించి నివేదిక సమర్పించారు. 1907 అక్టోబరు మాసంలో ఆయన గుజరాత్‌కు చెందిన వకీలు మణిలాల్ డాక్టర్ అను వారిని మారిషస్‌కు పంపించారు. మణిలాల్ డాక్టర్ మారిషస్ ప్రజల్లో గొప్ప రాజకీయ చైతన్యం తెచ్చారు. 'హిందుస్తానీ' అనే హిందీ పత్రికను ప్రారంభించి తద్వారా భారతీయుల్లో జాతీయ భావాల్ని ప్రచారం చేశారు. మారిషస్‌లో హిందీ మాట్లాడే వారి సంఖ్య ఎక్కువ. మణిలాల్ హిందీలో ఉపన్యసించి అక్కడి ప్రజలకు స్వభాషాభిమానం కలిగించారు. అప్పటి నుండి మారిషస్‌లో జరిగిన స్వాతంత్ర్య పోరాటంలో హిందీ కూడా ఒక సాధనంగా ఉపయోగపడింది. దక్షిణ భారతదేశంలో కూడా మహాత్మాగాంధీ హిందీ ప్రచారం ఈ దృక్పథంతోనే కావించారు. తమ కుమారుడు దేవదాస్ గాంధీని ప్రథమ హిందీ ప్రచారకుడుగా పంపి, దక్షిణ భారత హిందీ ప్రచార సభను స్థాపించి జాతీయ భాషా ప్రచారం కావించారు. ద్వితీయ ప్రపంచ హిందీ మహాసభల్ని ప్రారంభిస్తూ మారిషస్ ప్రధానమంత్రి సర్ శివసాగర్ రామ్‌గులాం ఈ విషయం పేర్కొని మహాత్మునికి శ్రద్ధాంజలి ఘటించారు.

మణిలాల్ డాక్టర్ ప్రోత్సాహంతో చాలా మంది భారతీయులు మారిషస్ జాతీయోద్యమంలో చేరారు. ఆర్యసమాజ స్థాపనకు కూడా మణిలాల్ అనుకూలమైన వాతావరణం కల్పించారు. అచిరకాలంలోనే ఆర్యసమాజం మారిషస్ దేశమందంతటా వ్యాప్తమై భారతీయుల్లో గొప్ప చైతన్యం తెచ్చింది. నాలుగు సంవత్సరాలు మారిషస్‌లో వున్న తరువాత ఫిజీ దేశంలో భారతీయుల స్థితి మరీ అధ్వాన్నంగా వున్నదని తెలిసి మణిలాల్ డాక్టర్ మహాత్ముని అనుమతితో మారిషస్‌ను వదలి ఫిజీ వెళ్ళిపోయారు. చెరకు తోటల యజమానులగు తెల్లదొరలకు, భారతీయ కార్మికులకు మధ్య సంఘర్షణ తీవ్రరూపం దాల్చింది.

*రథసారథి—సర్ రామ్‌గులామ్*

అదే సమయంలో సర్ శివసాగర్ రామ్‌గులాం రాజకీయ రంగంలోకి ప్రవేశించి లేబర్ పార్టీకి నాయకత్వం వహించి మారిషస్ స్వాతంత్ర్యోద్యమానికి సారథ్యం వహించారు. ఒక వైపున డాక్టరుగా ప్రాక్టీసు చేస్తూ, మరోవైపున స్వాతంత్ర్య సమరంలో ప్రవేశించి పనిచేయడం ప్రారంభించారు. అక్కడి కార్మికులలో గల ముఠా తగాదాలను పరిష్కరించి అందరినీ ఒక్క మార్గానికి తీసుకురావడానికి కృషిచేశారు. గ్రామగ్రామానికి వెళ్ళి భారతీయులలో ప్రచారం చేశారు. తీరిక సమయాలలో హిందీ క్లాసులకు, హిందీ కార్యక్రమాలకు వెళ్ళి ప్రజల్లో స్వభాషాభిమానం కలిగించేవారు. విద్యాశాఖలో అధికారిగా చేరి పై అధికారులను అంగీకరింపచేసి హిందీ, ఉర్దూ, తమిళం, తెలుగు, మరాఠీ, చైనా భాషలకు ప్రభుత్వ ఆదరణ కలిగించారు. 'అడ్వాన్సు' అను పత్రికను నెలకొల్పి ప్రజల్లో తన భావాలను బాగా ప్రచారం చేశారు. పోర్టు లూయిస్‌లో నివాసం ఏర్పాటు చేసుకొని ప్రజలతో నిత్య సంబంధం పెట్టుకొన్నారు. లేబర్ పార్టీ నాయకత్వం వహించి ప్రజలకు అండగా నిలబడ్డారు. 1942లో భారత

దేశంలో ప్రారంభమైన క్విట్ ఇండియా ఉద్యమాన్ని బహిరంగంగా సమర్థించారు. తనకు గల పదవులనన్నింటినీ వదులుకొని అక్కడి ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా నిలబడి ఉధృతంగా ప్రచారం ప్రారంభించారు. 1948లో జరిగిన ఎన్నికల్లో శివసాగర్ నాయకత్వాన లేబర్ పార్టీ విజయం సాధించింది. అయినా అవాంతరాలు తప్పలేదు. అన్నింటినీ ధైర్యంతో ఎదుర్కొని చివరికి 1967 ఆగష్టు 7వ తేదీన జరిగిన నిర్ణయాత్మకమైన ఎన్నికల్లో మారిషస్ ప్రజల స్వాతంత్ర్య కాంక్షకు విజయం చేకూర్చారు. తత్ఫలితంగా 1968 మార్చి 12 వ తేదీన మారిషస్‌కు స్వాతంత్ర్యం లభించింది. లేబర్ పార్టీ నాయకుడు సర్ శివసాగర్ రామ్‌గులాం స్వతంత్ర మారిషస్ దేశానికి ప్రధాన మంత్రిగా పదవీ స్వీకారం చేశారు. దేశంలోగల రకరకాల శక్తులనన్నింటిని దగ్గరకు తీసి, వాటినన్నింటిని సమన్వయం చేసి, తమ దేశంలో నూతన వ్యవస్థను, వాతావరణాన్ని సృష్టించి ప్రపంచంలో మారిషస్‌కు పేరు ప్రతిష్ఠలు గడించిపెట్టారు. జీవితానికి సంబంధించిన ఏ రంగంలోను హింసకు, అవ్యవస్థకు, అరాచకానికి తావు వుండకూడదని వారి అభిప్రాయం. మారిషస్ దేశం యీనాడు సాధించిన ప్రగతికి ముఖ్యులు భారతీయ కూలీలు, భారతీయ కార్మికులు, రైతులు కనుక వారిని అన్ని రంగాలలోను అభివృద్ధికి తీసుకొని రావడం అవసరమని సర్ శివసాగర్ నిశ్చితాభిప్రాయం. ప్రధానమంత్రి పదవి లభించిన తరువాత తన అభిప్రాయాల్ని అమలుబరచి చాలావరకు విజయం సాధించారు. ఆర్థిక పరిస్థితిని బట్టిగాక, మానవత్వపు విలువలను బట్టి దేశ ఔన్నత్యం పెరగాలనేది వారికిగల మరో అభిప్రాయం. ఈనాడు భౌతికంగా జరుగుతున్న వికాసానికి, మానవత్వపు విలువల ప్రగతికి మధ్య అగాధం పెరుగుతున్నదని, దాన్ని సరిచేయకపోతే ప్రపంచ మానవాళి ఎన్నో కష్టాలు ఎదుర్కోవలసి వుంటుందని వారి అభిప్రాయం.

స్వతంత్ర మారిషస్ దేశాన్ని ఈ మార్గాన అభివృద్ధికి తీసుకొని రావాలనే భావంతో 76 సంవత్సరాల వయస్సులో ఆఫ్రికాదేశాల సమాఖ్యకు అధ్యక్షులుగాను, కొలంబోలో జరిగిన అలీన దేశాధినేతల సమావేశంలో సభ్యులుగాను, ఇంకా అనేక రంగాలలోను యువకులకు మించిన ఉత్సాహంతో పాల్గొంటూ పనిచేస్తున్నారు మారిషస్ ప్రధాని సర్ శివసాగర్ రామ్‌గులాం.

*స్వాతంత్ర్యానంతరం అభివృద్ధి*

స్వాతంత్ర్యం పొందిన తరువాత మారిషస్‌లో అభివృద్ధి సాధనకై నిర్విరామంగా కృషి ప్రారంభమైంది. మారిషస్ వ్యవసాయ ప్రధానదేశం. పంచదార ఎగుమతివలన దానికి ఎక్కువ ఆదాయం వస్తున్నది. ఆ దేశంలోగల సారవంతమైన భూమిలో 62 వంతు భూమిలో చెరకు ఉత్పత్తి అవుతున్నది. ప్రపంచ విపణిలో మారిషస్ పంచదారకు గిరాకీ హెచ్చింది. చక్కెరతోబాటు తేయాకు, పొగాకు, లవంగాలు, యాలక్కాయలు కూడా ఇక్కడ ఉత్పత్తి అవుతాయి. ప్రపంచంలోని అనేక దేశాలకు అవి ఎగుమతి అవుతున్నాయి. ఇతర దేశాల నుండి తమకు అవసరమైన వస్తువులను అక్కడి ప్రభుత్వం దిగుమతి చేసుకొంటున్నది. ప్రపంచంలోని దేశాలన్నింటితోను మారిషస్‌కు సత్సంబంధాలు వున్నాయి. అందువలన ఇతర దేశాలన్నీ దీనికి సహాయం చేస్తున్నాయి. ఐక్యరాజ్య సమితిలోను, బ్రిటిష్ కామన్వెల్త్‌లోను మారిషస్‌కు సభ్యత్వం ఉన్నది. దేశంలో ఉత్పత్తి బాగా పెరగడంవలన ఆదాయం కూడా పెరిగింది. పెరిగిన ఆదాయంతో తమ దేశ పౌరులకు సౌకర్యాలు కలిగించేందుకు అక్కడి ప్రభుత్వం పూనుకొని ఆ ప్రయత్నంలో చాలావరకు విజయం సాధించింది. 1971 నాటికి 23500 మంది నిరుద్యోగులు ఉన్నారని తేలినది. ఈ సమస్యను పరిష్కరించేందుకు ప్రభుత్వం కొత్త కొత్త రంగాలను సృష్టించి చాలా మందికి భృతి కల్పించింది.

రకరకాల పరిశ్రమల స్థాపనకు పూనుకొన్నది. మంత్రులు ప్రజలకు మిక్కిలి సన్నిహితంగా ఉండటం, సమస్యల పరిష్కారం త్వరత్వరగా జరిగిపోవడం, ప్రధానమంత్రి పట్ల ప్రతివారికి పూజ్యభావం ఉండటం మొదలైన కారణాలవలన అక్కడి పౌరులలో 'ఇది నా దేశం' అనే భావం ప్రబలంగా ఏర్పడివున్నది తమ స్థితికి సంతృప్తి కలిగివుండి దేశప్రగతికి కృషి చేయాలనే తలంపు ప్రజల్లో ఏర్పడివున్నది. 'మా దేశాన్ని గురించి మీ అభిప్రాయం ఏమిటి ? మా దేశం మీకు నచ్చిందా ?' అని వారు అడుగుతూ ఉంటారు. తమ పూర్వులు పడిన కష్టాలను గురించి వాళ్ళు చెబుతూ ఉంటారు.

మారిషస్ దేశాన్ని చిన్న ప్రపంచమని, లేక మినీ ఇండియా అని చెప్పవచ్చును హిందువులు, క్రైస్తవులు, బౌద్ధులు, మహమ్మదీయులు అక్కడ ఎక్కువగా ఉన్నారు. భారతీయులు, మహమ్మదీయులు, చైనీయులు, ఇంగ్లీషువాళ్ళు, ఫ్రెంచివాళ్ళు ఉన్నారు. వారిలో చాలామందికి ప్రభుత్వంలోను, పార్లమెంటులోను ప్రాతినిధ్యం ఉన్నది. మతాల పేరిట, కులాలపేరిట, భాషల పేరిట అక్కడ ఘర్షణలు లేవు. అన్ని మతాలవారు స్వేచ్ఛగా తమ తమ మతాలను పాటిస్తూ ఉంటారు. మతాలపైన, భాషలపైన గాక అందరి దృష్టి దేశప్రగతి మీద ఎక్కువగా కేంద్రీకృతమై ఉన్నది.

*సగటుగా ప్రజల జీవితం*

అక్కడి ప్రభుత్వోద్యోగులే గాక ఇతర రంగాలలో పని చేస్తున్న వారి ఆదాయం కూడా ఎక్కువగా ఉన్నది. అక్కడి ప్రభుత్వోద్యోగుల కనీస వేతనం 550 మారిషస్ రూపాయల వరకు ఉన్నది. మన రూపాయలైతే 700 లకు పైగా ఉంటుంది. ప్రాథమిక పాఠశాలల ఉపాధ్యాయులకు జీతం 700 రూపాయలకు తక్కువలేదు. ప్రతి సంవత్సరం ఇంక్రిమెంట్లు వగైరాలన్నీ యిస్తారు. కాలేజీ లెక్చరర్లకు 4 వేల రూపాయలకు మించే జీతం వస్తుంది.

పోలీసులకు, ఇన్స్పెక్టర్లకు జీతం వెయ్యి రూపాయలకుపైనే. మంత్రులకు 6 వేల రూపాయిలదాకా జీతం వస్తుంది. ప్రధానమంత్రికి, గవర్నరుకు ఇంకా ఎక్కువ జీతం లభిస్తుంది. పన్నులు వగైరాలన్నీ ఉన్నాయి. ఒక్కొక్క కుటుంబంలో సంపాదనపరులు ఇద్దరైనా ఉంటారు. మొత్తం మీద అక్కడి పౌరులు నిజాయితీగాను, పరిశుభ్రంగాను, సంతృప్తిగాను జీవితం గడుపుతున్నట్లు కనబడతారు. మత్స్యం, మాంసం, మద్యం అక్కడ ఎక్కువ. పాశ్చాత్య ప్రభావం ఎక్కువగా ఉండటం వలన మద్యపానం అక్కడ సభ్యతా లక్షణంగా పరిగణింపబడుతూ ఉన్నది. ఆ దేశంలో శాకాహారుల సంఖ్య తక్కువే. మత్స్యపరిశ్రమ వలన, విలాస యాత్రికుల వలన మారిషస్‌కు ఆదాయం బాగా వస్తుంది.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మారిషస్‌లో ఎన్నికలు జరుగలేదు. అక్కడ ఎన్నికలు జరిపేందుకు ఏర్పాట్లు మేము వెళ్ళినప్పుడు జరుగుతున్నాయి. అక్కడ కీలకమైనది చక్కెర పరిశ్రమ. ప్రభుత్వ అజమాయిషీ ఎక్కువగా ఉన్నప్పటికీ ఇది ప్రధానంగా ఫ్రెంచివారి చేతుల్లో ఉన్నది. ప్రభుత్వం అక్కడ ప్రైవేటు రంగంతో తాను కూడా కొంతవరకు కలిసి పనిచేస్తున్నది. ఆ విధంగా ప్రైవేటు రంగాన్ని ప్రోత్సహిస్తున్నది. పరిశ్రమలన్నింటిని జాతీయం చేయాలనే నినాదం అక్కడ వినబడుతున్నది. సంవత్సరాల తరబడి ప్రజలు బానిసత్వంలో మ్రగ్గినందున, సాంకేతిక పరిజ్ఞానం, ప్రభుత్వ నిర్వహణ మొదలుగా గల రంగాలలో ప్రభుత్వానికి ఇబ్బందులు కలుగుతున్నాయి. చదువుకొన్న యువతీ యువకులు ఉద్యోగాలకై ఎగబడుతూ ఉన్నందున వ్యవసాయ రంగంలోను, అట్టి ఇతర రంగాలలోను ఇబ్బందులు కలుగుతూ ఉన్నవి. అందువలన ప్రభుత్వం వృత్తి విద్యలను ప్రోత్సహించడం ప్రారంభించింది. ఇతర దేశాలనుండి దిగుమతి అయ్యే వస్తువులకు ఆయా దేశాలలోనే

ధరలు పెరగడం వలన అధిక ధరల సమస్యను కూడా ప్రభుత్వం ఎదుర్కోవలసి వచ్చింది. వాటినన్నింటిని ధైర్యంతో ఎదుర్కొంటు మారిషస్ ప్రభుత్వం, ప్రజలు ప్రగతి పథంలో ముందుకు సాగుతూ ఉన్నారు.

ప్రముఖులతో సమావేశం

ప్రధానమంత్రి సర్ శివసాగర్ రామ్‌గులాంను కలుసుకొన్న తరువాత మారిషస్ ప్రభుత్వ ఆర్థిక శాఖామాత్యుల్ని కలుసుకొన్నాము. వారి పేరు సర్ వీరాస్వామి రింగడు. మారిషస్ ప్రభుత్వంలో వీరికి మహత్తరమైన స్థానం ఉన్నది. వీరి తండ్రి తెలుగువారు, తల్లి తమిళ వనిత. తెలుగు ప్రజలు, తెలుగుభాష, తెలుగు సాహిత్యం మీద వీరికి అభిమానం ఉన్నది. శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు వీరిని ఆంధ్ర ప్రదేశ్‌కు ఆహ్వానించారు. ఆంధ్ర ప్రదేశ్ వచ్చేందుకు అంగీకరించారు. మారిషస్‌లో తెలుగు ప్రజల అభ్యున్నతికి, తెలుగు భాషాభివృద్ధికి తప్పక సహకరించగలమని అన్నారు. వారితో జరిగిన సంభాషణ ఎంతో ఆనందం కలిగించింది. ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం, ప్రజలు, అంతర్జాతీయ తెలుగు సంస్థ పక్షాన శ్రీ కృష్ణారావుగారు అజంతా చిత్ర ఫలకం, ప్రపంచ తెలుగు మహాసభల సావనీరు శ్రీ వీరస్వామి రింగడు గారికి అందజేశారు.

తరువాత విద్యాశాఖామాత్యులు శ్రీ పాపరాన్ (ఇప్పుడు వీరు పదవిలో లేరు) గారిని కలుసుకొన్నారు. ద్వితీయ ప్రపంచ హిందీ మహాసభల కార్యనిర్వహణ బాధ్యత వీరిపై ఎక్కువగా పడింది. వీరు ఫ్రెంచివారు. అయినా అక్కడి స్వాతంత్ర్య పోరాటంతో వీరికి సంబంధం ఎక్కువగా వున్నది. మితభాషి, సరళ స్వభావులు. శ్రీ కృష్ణారావుగారి ఎడ వీరు ఎంతో ఆదరణ చూపించడమేగాక అక్కడి విద్యావిధానం మొదలుగా గల వివరాలు అందజేసి, ఒక్క

పూట శ్రీ కృష్ణారావుగారికి తమ ఇంట్లో ఆతిథ్యం ఇచ్చి గౌరవించారు. శ్రీ కృష్ణారావుగారు వారికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, ప్రజలు, తెలుగు సంస్థ పక్షాన అజంతా చిత్రఫలకం, సావనీరు అందజేశారు. వారు కూడా మారిషస్‌లోగల తెలుగు వారికి ఇతోధికంగా సహకరిస్తామని మాట ఇచ్చారు.

తరువాత పార్లమెంటరీ కార్యదర్శి శ్రీ సింహాద్రి వీరాస్వామి గారిని, ద్వితీయ ప్రపంచ హిందీమహాసభల కార్యాధ్యక్షులు, సామాన్య ప్రజలతో కలిసిమెలసి ఉండే కార్యకర్త, యువజన, క్రీడా శాఖా మాత్యులు శ్రీ దయానందలాల్ వసంతరాయ్ గారలను (ఇప్పుడు పరిశ్రమల శాఖామాత్యులు) వారి కార్యాలయాలలో కలుసుకొని అజంతా చిత్రఫలకాలను, సావనీర్లను శ్రీ కృష్ణారావు గారు వారికి అందజేశారు.

తరువాత భారత ప్రభుత్వ హైకమీషనర్ శ్రీ ఎం. ఎం. ఖురానాగారిని బరోడా బ్యాంకు బిల్డింగులోగల వారి కార్యాలయానికి వెళ్ళి కలుసుకొన్నారు. వారికిఅజంతా చిత్రఫలకం, సావనీరు శ్రీ కృష్ణారావుగారు అందజేశారు. మారిషస్‌లోగల తెలుగు వారికి సాయం చేయాలంటే వీరి సహకారం చాలా అవసరం. 23వ తేదీ నుండి తరచు వారు కలుస్తూఉండటం, శ్రీ కృష్ణారావుగారి కార్యక్రమాలను వారు పరిశీలిస్తూఉండటం, మారిషస్ మంత్రులను కలిసినప్పుడు శ్రీ కృష్ణారావుగారి వెంటతాను కూడావుండటం వలన తెలుగు ప్రజల ఎడ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఎడ, శ్రీ కృష్ణారావుగారి ఎడ ఆదరణ చూపడమే గాక తెలుగు వారికి సహాయం చేసేటందుకు తమ సంసిద్ధతను అనేక పర్యాయాలు ప్రకటించారు. డాక్టర్ వేటూరి ఆనంద మూర్తిగారికి అవసరమైన సహాయసహకారాలు అందించడం తమ పనిగా భావిస్తామని కూడా మాట ఇచ్చారు. శ్రీ ఖురానా అక్కడి ప్రభుత్వాధినేతలతోను, అధికారులతోను, ప్రజలతోను భారత ప్రభుత్వ

రాయబారిగా ఎంతో మంచిగా ఉంటూ వారందరి ప్రేమను చూరగొంటున్నారు.

*మారిషస్ పర్యటన*

ఈ కార్యక్రమమంతా పూర్తి అయేసరికి 12 గంటలు దాటింది. మారిషస్ పర్యటన కార్యక్రమం ప్రారంభమైంది. అక్కడి నుండి అలెగ్జాండ్రా జలపాతం చూచేందుకు బయలుదేరాము. పోర్టు లూయీస్‌కు 30 మైళ్ల దూరాన ఈ జలపాతం ఉన్నది. కొండల మీద ఎంతో ఎత్తున ఈ ప్రదేశం ఉన్నది. ఈ కేంద్రాన్ని యాత్రా స్థలంగా మార్చి, ఇందిరాగాంధీ ఇక్కడకు వచ్చినప్పుడు వారి చేత ప్రారంభోత్సవం చేయించారు. వేలాది అడుగుల ఎత్తున గల దుర్గమ అరణ్యాలతో కూడిన కొండ శిఖరాలపై నుండి నీటి ప్రవాహం క్రిందపడుతూ ఉంటే చూడటానికి ఆహ్లాదంగా ఉంటుంది. ఆ నీరంతా సముద్రంలోకి పోయి కలుస్తుందని అక్కడివారు చెప్పారు.

అక్కడి నుంచి సెవెన్ కలర్స్ ఎర్త్ (ఏడు రంగుల దిబ్బ) ను చూచేందుకు బయలుదేరాము. అక్కడికి సుమారు 20 మైళ్ళ దూరాన వున్నది. ఎంతో ఎత్తుగా వున్న కొండల మీద నుండి పూర్తిగా క్రిందికి దిగవలసి వచ్చింది. తిరుపతికొండ రోడ్డు, జమ్మూ నుండి శ్రీనగర్ వరకు వెళ్ళే కొండల రోడ్డు జ్ఞాపకం వచ్చాయి. ఎన్నో వంకలు తిరిగి, గగుర్పాటు కలిగించే ఆ కొండల రోడ్లమీద ప్రయాణం చేసి వేలాది అడుగుల క్రిందకు దిగివచ్చాము. త్రోవలో మూడు నాలుగు పెద్ద పెద్ద గ్రామాలు వున్నాయి. వాటినన్నింటిని దాటి చెరకు పొలాల మధ్యగా ప్రయాణం చేసి చివరికి ఏడురంగుల దిబ్బ దగ్గరకు చేరుకొన్నాం. షా మరెల్ అనుచోట సుమారు ఒక ఎకరం మేర యీ దిబ్బ వున్నది. ప్రకృతి వైచిత్ర్యం యిక్కడి మట్టిలో కనబడుతుంది. ఏడు రంగుల మట్టి స్పష్టంగా కనబడుతుంది

ఎంత పెద్ద వర్షం కురిసినా ఆ ఏడు రంగులు కరిగిపోవు. ఈ మట్టి మీద గడ్డిగాని, మొక్కలుగాని మొలవవు ఆ దిబ్బకు కొంత దూరాన గడ్డి మొక్కలు మొలిచి వున్నాయి. ఒకే చోట ఏడు రంగుల్లో మట్టిని చూస్తుంటే ఆశ్చర్యం కలుగుతుంది. బంజరుగా వున్న ఆ దిబ్బ యాత్రీకుల్ని అమితంగా ఆకర్షిస్తుంది. జనం రంగు రంగుల దిబ్బ మీదకు ఎక్కి దాన్ని చూడవచ్చును.

విద్యాలయాలు అగుపిస్తేచాలు...

అక్కడి నుంచి సముద్ర తీరాన బయలుదేరాం. త్రోవలో బెల్ ఓంబ్రే అను గ్రామంలో ఒక స్కూలు దగ్గర ఆగి అక్కడ తెలుగు తరగతుల్ని చూచేందుకు వెళ్ళాము. అక్కడ పాఠశాలల భవనాలు ఎంతో అందంగా కట్టబడి వుంటాయి. వాతావరణం ప్రశాంతంగా వుంటుంది. స్కూలు పిల్లలకు పాలు, బన్ను రొట్టెలు ప్రభుత్వంవారు సరఫరా చేస్తారు. స్కూలు పిల్లలకు తినేందుకు అందజేసే వస్తువులు పరిశుభ్రంగా వుంటాయి. పిల్లలంతా వరుసగా క్యూ సిస్టంలో నిలబడి పాలు, రొట్టె తీసుకొంటారు. హెడ్‌మాస్టర్‌గాని, ఇతర టీచర్లుగాని పిల్లలకు ఆ వస్తువులు అందే వరకు దగ్గర వుంటారు. బిల్ ఓంబిసేలో గల ప్రభుత్వ పాఠశాలలో తెలుగు తరగతి నడుస్తున్నది. సోకప్పడు అన్న తెలుగువారి రెండవ కుమార్తె ఇక్కడ తెలుగు టీచరుగా వున్నది. శ్రీ కృష్ణారావుగారు ఆ స్కూలుకు వెళ్ళి తెలుగు తరగతిని చూచారు. పిల్లలందరినీ తెలుగులో పలకరించడం, వాళ్ళచేత తెలుగులో మాట్లాడించటం, తెలుగు పద్యాలు చదివించడం, తెలుగు పాటలు పాడించడం వలన అక్కడ తెలుగు వాతావరణం ఏర్పడుతూ వుంటుంది. మిగతా భాషల ఉపాధ్యాయులంతా తెలుగు భాషా బోధనకు కలిగిన ప్రాముఖ్యాన్ని గుర్తించడం జరిగింది. స్కూలు లోని ఇతర క్లాసుల్ని కూడా చూచి శ్రీ కృష్ణారావుగారు విజిటర్సు బుక్కులో సంతకం చేశారు.

తరువాత మజిలీ చావాన్లతల్లి. ఇక్కడ కూడా ప్రభుత్వ పాఠశాల వున్నది. ఇక్కడ యిద్దరు తెలుగు ఉపాధ్యాయినులు వున్నారు. విద్యార్థుల సంఖ్య కూడా ఎక్కువే. ఈ స్కూలులో శ్రీ కృష్ణారావుగారి స్వాగతార్థం జండాలు కట్టి అలంకరణ చేశారు. అక్కడ తెలుగు బోధించే ఉపాధ్యాయిని సోకప్పుడుగారి పెద్ద కుమార్తె. తెలుగు క్లాసు పరిశీలనకాగానే అక్కడి ఉపాధ్యాయు లంతా ఒక సమావేశం ఏర్పాటు చేశారు. ఆ సమావేశంలో శ్రీ కృష్ణారావుగారు తెలుగులో క్లుప్తంగా ప్రసంగించారు. పుష్పరాజ్ సూరయ్య క్రియోల్ లో శ్రీ కృష్ణారావుగారి ప్రసంగ సారాంశం చెప్పారు. మారిషస్ లో ప్రతిచోట అతిథుల గౌరవార్థం టీలు, కాఫీలు యివ్వరు. కోకాకోలా, ఫాంటా మొదలగు పానీయాలు యిస్తారు. అవి అక్కడ చాలా చవుక. మూడుగ్లాసుల కోకాకోలా ఖరీదు 50 పైసలు దాకా వుంటుంది. వెళ్ళిన ప్రతిస్కూల్లోను బిస్కట్లు, షర్బత్తులు యిచ్చి సమావేశాలు జరిపి శ్రీ కృష్ణారావు గారిని వారి బృందాన్ని అక్కడివారు గౌరవించారు. ఆ స్కూల్లో కార్యక్రమం పూర్తి అయ్యేసరికి మధ్యాహ్నం రెండు గంటలు దాటింది. అంటే భారత కాలమానం ప్రకారం 3.50 అయినట్లు. అప్పటికి భోజనాలు కాలేదు. అక్కడికి ఆరుమైళ్ళ దూరానగల సోకప్పడిగారింటికి వెళ్ళి ఉదయాన్నే వెంటతెచ్చిన భోజనం చేశాము. విశ్రాంతి తీసుకునేందుకు కొంచెం కూడా సమయం దొరకలేదు.

కార్యక్రమం ప్రకారం మారిషస్ ఆంధ్ర మహాసభ కార్యదర్శి శ్రీ బాల గోపాలుడు, కోశాధికారి శ్రీ ఉన్నప్పగారల గ్రామం బీమ్ విల్లాకు వెంటనే బయలుదేరాము. అక్కడ ఆంధ్ర మహాసభ బ్రాంచి సొంత భవనం వున్నది. అందులోనే దేవాలయం. తెలుగువారు స్త్రీలు పురుషులు చాలామంది ఆ సభలో పాల్గొన్నారు. మారిషస్ లో జరిగిన తెలుగువారి ప్రతి సభలోను ఉపన్యాసాలతో బాటు హార్మోనియం

ఢోలక్, తబలాల మీద భజనలు చేయడం, పాటలు పాడటం తప్పని సరిగా జరుగుతూనే వున్నాయి. ఆంధ్ర మహాసభ బ్రాంచీ లన్నింటికి అక్కడి ప్రభుత్వం వాయిద్యాలు గ్రాంటు రూపంలో ఇచ్చింది. అంతేగాక మారిషస్ ఆంధ్ర మహాసభకు కూడా కార్య క్రమాలు జరుపుకొనేందుకు ప్రతి సంవత్సరం 25 వేల రూపాయల గ్రాంటు కూడా ఇస్తున్నదని తెలిసింది. ఇతర భాషా సంస్థలకు కూడా ఇదే విధంగా అక్కడి ప్రభుత్వం సహాకరిస్తున్నది

*అక్కడి తెలుగు పలుకుల తీరుతెన్నులు*

ఆ సభలో పండిత్‌జీ ఈ విధంగా స్వాగతం చెప్పారు. "తల్లులారా ! తండ్రులారా! నాయనలారా! శ్రీ కృష్ణరావు గారూ! మాకు బహుసంతోషము. ఈజనులంతా ఎంతైతే ఉన్నారో అందరి, మా అందరి తలిదండ్రులు, తాతముత్తాతలు దేశం నుంచి వచ్చినారు. ఆ దేశం నుంచే వచ్చినారు. మా ఆ దేశము నుంచి అనగా మా తాత ముత్తాతల దేశం నుంచి మీరు వచ్చినారు మాకు నిండు సంతోషము. మాకు స్వాతంత్రము వచ్చింది. ఇందులో ఆంధ్రులమంతా వున్నాము. తెలుగు అంతా వున్నారు. మా భాష. మా స్థానమున సంస్కృతిని జీవిగా వుంచుతాము. మా కోరిక యిదే. ఇచ్చట హిందీ ఉన్నది. తమిళము వున్నది ఆ దేశము నుంచి వారంతా 35 సంవత్సరముల నాడే వచ్చి వారందరికి సహాయ్యము చేసిరి. కాని మాకు మనదేశము వారు ఎవ్వరు వచ్చి సహాయ్యము చేయలేదు. మీరు వస్తిరి. మాకు నిండు సంతోషము దేవుడా! పరమేశ్వరుడా, అతనిని రక్షించుము. నా యెదుట నున్న విద్యా మంత్రిని రక్షించుము." మరో తెలుగు పెద్ద ఈ విధంగా ప్రసంగిం చారు. "పూజ్య కృష్ణారావుగారు, పండిట్‌గారు! ఆంధ్ర నాయ కులుగారు, ఆంధ్ర సహోదరీజనులారా! ఈ రోజున మాకు చాలా ఆనందము వస్తున్నది. మా తాత ముత్తాతలు ఆంధ్ర దేశము నుండి

వచ్చారు మారిషస్ కి మా యొక్క సాంస్కృతము, మా యొక్క భాష, అంతా వెంట తెచ్చి మాకు యిచ్చారు. మా ద్వీపము చాల చిన్నది. భారత దేశము చాల విశాలదేశము. భారత దేశము తల్లి, మాది బిడ్డ. మమ్ములచూడడానికి మా తాతలు వచ్చిరని మేము భావిస్తున్నాము. తాత వస్తున్నారు. తాత ఎస్తున్నారు అని బిడ్డలు అరచినట్లు మేము ఈనాడు సంతోషము పడుచుంటిమి. తాతకి ముద్దులు యిచ్చుటకు సిద్ధపడితిమి. తాతకు ముద్దు యిచ్చుటకు మాకు అవకాశము దొరకలేదు. కాని మీరు, పంతులుగారు వచ్చినారు. మీ ప్రణాళిక మా సంస్కృతి, మా భాష పెరుగుటకు, పూర్తిగా పెరుగుటకు, మా ఆంధ్ర ప్రదేశము సహాయము దొరుగును. ఈ రోజున మాకు చాల ఆనందము. ఆంధ్ర ప్రదేశము నుంచి ఎన్నో చిత్రములు, ఫిల్ములు, పుస్తకాలు తెచ్చి యిచ్చినారు. తాత మిఠాయిలు తెచ్చిండని నిండా సంతోషముగా నున్నది. మీకు ధన్య వాదములు. స్పష్టముగా మళ్ళి రాబోతరని మాకు నమ్మకమున్నది. ధన్యవాదము.''

శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు అక్కడి తెలుగు ప్రజలందరు చూపిన ఆదరణకి కృతజ్ఞతలు తెలిపి తెలుగు భాషను మరిచిపోవద్దని, ఇండ్లలో తెలుగులోనే మాట్లాడమని అప్పుడే తెలుగు వారుగా వుండిపోగలరని, తెలుగువారు ఎక్కడ వున్నా అంతా ఒక్కటేనను గౌరవం వచ్చేలా చేయమనిచెప్పి అందరికి ధన్యవాదాలు సమర్పించారు.

స్త్రీలు, పురుషులు తెలుగులో పాటలు పాడారు. భజనలు చేశారు. అక్కడి నుండి తెలుగువారి ఇండ్లకు తీసుకొని వెళ్ళారు. మీటింగు జరిగిన ప్రతిచోట జనానికి స్వీట్లు పంచారు. కోకాకోలా, ఫాంటాలు ప్రజలందరికి అందజేశారు. శ్రీ కృష్ణారావుగారు వెళ్ళిన ప్రతి ఇంట్లోను పండుగలా చేశారు. ప్రతిచోట స్వీటు. ప్రతిచోట

పాటలు, పద్యాలు, భజనలు, పర్వుత్తులు అక్కడి కార్యక్రమాలు పూర్తి అయ్యేసరికి సాయంత్రం ఆరు గంటలు దాటింది. ఇంకా మూడు కేంద్రాలలో కార్యక్రమాలు వున్నాయి.

రోస్ బెల్లాలో ఆంధ్ర మహాసభల బ్రాంచీలో కార్యక్రమం జరిగింది. తెలుగు స్త్రీలు పురుషులు చాలా మంది వచ్చారు. అనేక మంది తెలుగు పెద్దలు భజనలు బ్రహ్మాండంగా తన్మయత్వంతో చేశారు. అక్కడ కార్యక్రమం ముగించుకొని టాక్సాన అను కేంద్రం చేరుకొన్నాము. అక్కడ కూడా ఆంధ్ర మహాసభ బ్రాంచి వున్నది. చుట్టుప్రక్కల నుండి వచ్చిన తెలుగు స్త్రీ పురుషులతో భవనం కిటకిట లాడిపోయింది. ఆలశ్యమైనప్పటికి తెలుగు ప్రజలు ఎదురుచూస్తూ వుండిపోయారు. అక్కడ తెలుగు, ఇంగ్లీషు, హిందీ, క్రియోల్ నాలుగు భాషలు ఉపయోగించబడ్డాయి. ఈ సభలన్నింటిలోను మారిషస్ ఆంధ్ర మహాసభ అధ్యక్షులు శ్రీ అచ్చన్న, కార్యదర్శి శ్రీ బాలగోపాలుడు, కోశాధికారి శ్రీ ఉన్నప్పగారలు కూడా పాల్గొన్నారు. ఈ కేంద్రంలో కార్యక్రమం పూర్తి అయ్యేసరికి రాత్రి 9 గంటలు దాటింది.

అక్కడికి 20 మైళ్ళ దూరాన సోకప్పడిగారి కేంద్రం వున్నది. 25వ తేదీ చివరి మజిలీ యిదే. అక్కడికి చేరునప్పటికి రాత్రి 10 గంటలు దాటినది. ఆంధ్ర మహాసభ బ్రాంచి అక్కడ కూడా వున్నది. ఆ భవనంలోని హాలంతా తెలుగుస్త్రీలతోను పురుషులతోను, పిన్నలతోను పెద్దలతోను నిండిపోయింది. పెద్ద సభ జరిగింది. భజనలు బాగా జరిగాయి. సోకప్పడు తెలుగువారు. వారి ఒక కుమారుడు విజయవాడ లయోలాకాలేజిలో చదువుకొంటున్నాడు. ఇండియాలో చదువుకొంటున్నాడు అంటే అక్కడ చాలా గౌరవం. శ్రీ సోకప్పడుగారి ఇంటిలో భోజనం ఏర్పాటు చేశారు. కార్యక్రమం రాత్రి 12 గంటలు దాకా సాగింది. ఏ కేంద్రానికి వెళ్ళినా తెలుగు

వారు చూపించిన ఆప్యాయతకు అంతులేదు. స్వంత బంధువులు వచ్చినట్లు తెలుగు వారంతా భావించి ఆనందించారు.

ఆ తరువాత బయలుదేరి పోర్టులూయిస్ చేరుకొన్నాం. ఆ రోజున హోటలుగదికి చేరుకునేసరికిరాత్రి బాగా ప్రొద్దుపోయింది.

*ప్రభుత్వ పాఠశాలల్లో తెలుగు తరగతుల పరిశీలన*

ది. 26-8-1976 ఉదయం నుంచి మారిషస్ ప్రభుత్వ పాఠశాలలకు వెళ్ళి అక్కడి తెలుగు తరగతుల చూడటం, తెలుగు నేర్చుకొంటున్న పిల్లల భాషాయోగ్యత, తెలుగు నేర్పుతున్న ఉపాధ్యాయుల యోగ్యతను శ్రీ కృష్ణారావుగారు చూడటం ప్రారంభించారు. అక్కడి స్కూళ్ళ భవనాలు పరిశుభ్రంగా ఉంటాయి. ఉపాధ్యాయుల జీతాలు సంతృప్తికరంగా ఉన్నాయి. ప్రతి స్కూల్లోను బాలబాలికలకు ప్రధానోపాధ్యాయులు దగ్గరవుండి రొట్టె, పాలు, బిస్కట్లు యిప్పించడం చూచాము. ప్రభుత్వం వారు ఇందునిమిత్తం ఖర్చుపెడుతున్న సొమ్ము సద్వినియోగం అవుతున్నదన్న నమ్మకం అక్కడి పరిస్థితులు చూచిన ప్రతివారికి కలగడం సహజం. కృష్ణారావుగారు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వంలో విద్యాశాఖామాత్యులని, తెలుగు భాషాబోధన అక్కడి స్కూళ్ళలో ఎలా జరుగుతున్నదీ స్వయంగా చూచి తెలుసుకొనేందుకై వస్తున్నారనీ తెలిసి అక్కడి స్కూళ్ళలోని ఉపాధ్యాయులంతా ఎంతో సంతోషంతో స్వాగతం చెప్పడమేగాక ప్రతిచోట సభలు ఏర్పాటు చేశారు. ఆ సభల్లో వివిధ భాషాపండితులు పాల్గొనడం, భారతదేశ పరిస్థితుల్ని గురించి అడిగి తెలుసుకొనేందుకు ప్రయత్నించడంతో బాటు తమ దేశాన్ని గురించి, తమ పాఠశాలలను గురించి విద్యాశాఖామాత్యుల అభిప్రాయాలన్ని తెలుసుకొనేందుకు ప్రయత్నించేవారు. ప్రతి స్కూల్లోను సభ జరిగిన తరువాత బిస్కట్లు, కోకాకోలా, ఫాంటా, పర్బత్తులతో సభికుల్ని గౌరవించడం పరిపాటి అయింది. అక్కడి ప్రభుత్వంవారు కూడా

శ్రీ కృష్ణారావుగారు ప్రభుత్వ పాఠశాలల్ని దర్శిస్తున్నారని, తెలుగు భాషా బోధనను గురించి ప్రత్యేకించి శ్రద్ధ వహిస్తున్నారని తెలిసి చాలా సంతోషించారు.

ఉదయం 11 గంటలకు లావనీర్ యందలి ప్రభుత్వ పాఠశాలలకు అంతా వెళ్ళాము. పాఠశాలలో గల బాలబాలికల సంఖ్య 720. వారిలో తెలుగు విద్యార్థుల సంఖ్య 75. తెలుగు బోధించే ఉపాధ్యాయులు ఇద్దరు ఈ స్కూల్లో పనిచేస్తున్నారు. అది అద్దె భవనమని, నెలకు అద్దెక్రింద ప్రభుత్వం 2,000/– రూపాయలు చెల్లిస్తున్నదని తెలిసింది.

మరో స్కూలుకు వెళ్ళాము. మొత్తం విద్యార్థుల సంఖ్య 960. అక్కడినుంచి మాతోపాటు వున్న శ్రీ సూరయ్యగారి గ్రామం మౌంటికా వెళ్ళాము. అక్కడి స్కూలులో మొత్తం విద్యార్థుల సంఖ్య 380. తెలుగు నేర్చుకునే పిల్లల సంఖ్య 48. ఒక్క తెలుగు టీచరు అక్కడ పనిచేస్తున్నారు. అక్కడి నుంచి మరో కేంద్రం రిచేమోనే వెళ్ళి అక్కడి పాఠశాలను చూశాం. అక్కడ మొత్తం విద్యార్థుల సంఖ్య 207. తెలుగు నేర్చుకునే పిల్లల సంఖ్య 112. నలుగురు తెలుగు ఉపాధ్యాయులు అక్కడ పనిచేస్తున్నారు

అక్కడి నుంచి పామ్‌బిష్ హోటలు చేరుకున్నాం. ఈ హోటలు తెలుగువారి ఆధ్వర్యాన నడుస్తున్నది. అన్నీ పాశ్చాత్య పద్ధతులే. శ్రీ కృష్ణారావుగారిని, వారి బృందాన్ని వారు అమితంగా ఆదరించారు. శాకాహార భోజనం ప్రత్యేకించి తయారుచేయించారు. ఈ హోటలు సముద్రం ఒడ్డున వున్నది. హోటలు గదులన్నీ కుటీరాల్లా వున్నాయి. కాని లోపల మాత్రం అత్యాధునిక సౌకర్యాలు ఏర్పాటు చేయబడి వున్నాయి. భోజనం అయిన తరువాత ఒక గంట సేపు ఆ హోటల్లో విశ్రాంతి తీసుకొన్నాం.

సాయంత్రం అక్కడి నుంచి బయలుదేరి మారిషస్ మధ్య ప్రాంతానికి చేరుకున్నాం. 5 గంటలకు ఆంధ్ర మహాసభకు చెందిన బ్రాంచిలో తెలుగువారి సభ ప్రారంభమైంది. ఉపన్యాసాలు, భజనలు, పాటలతో కార్యక్రమం రెండు గంటల సేపు జరిగింది. తెలుగు వారందరికి ఈ సభలు పండుగల్లా సాగినవి. ఆంధ్ర మహాసభ అధ్యక్షులు, కార్యదర్శి వెంటవుండటం అందరూ తమతమ కష్టసుఖాలు వచ్చీరాని తెలుగులో చెప్పడంవలన ఇంగ్లీషు, క్రియోల్ భాషలతో కూడిన అక్కడి వాతావరణం మారిపోయి తెలుగు భాషా వాతావరణం ఏర్పడటం పరిపాటి అయిపోయింది. అక్కడి తెలుగు ప్రజలు తెలుగు పూర్తిగా మరచిపోయారు. ఇంగ్లీషు, క్రియోల్ భాషల ప్రాబల్యం అపరిమితం కావడం, తెలుగు భాషవల్ల పెద్దగా ప్రయోజనంలేకపోవడం వలన యిండ్లలో సైతం తెలుగు వాడకం తగ్గిపోయింది. కాని అక్కడి తెలుగువారిలో మాత్రం తెలుగువారమనే భావం సడలిపోలేదు

*తెలుగు మరువని తెలుగు తల్లులు*

పోర్టు లూయిస్‌లో గల జ్యోతి మహాసభకు వెళ్లాము. మారిషస్‌లో గల తెలుగు సంస్థల్లో యిది చాలా పెద్ద సంస్థ. దేవాలయంలో తెలుగు వారంతా కలిసి భజనలు చేస్తూంటారు. తాళాలు పట్టుకొని భజనలు చేయడం భక్తి గీతాలు పాడటం ఇక్కడ కూడా చాలా సేపు జరిగింది. శ్రీ కృష్ణారావుగారి చేతికి తాళాలు అందించి అంతా భజనలు ప్రారంభించారు. శ్రీ కృష్ణారావుగారు కూడా అందరితో కలసి తాళం వేశారు. జ్యోతి మహాసభలో భజన కార్యక్రమం పెద్ద స్థాయిలో జరిగింది. తరువాత పెద్ద సభ జరిగింది. జ్యోతి మహాసభల అధ్యక్షులు శ్రీ చెంగాల రాయుడు, కార్యదర్శి ఎస్. దాలపాలు. స్త్రీలు పురుషులు పెద్ద సంఖ్యలో వచ్చి పాల్గొ

న్నారు. 1860లో తెలుగువారు మారిషస్ చేరుకొన్న తరువాత నెమ్మదిగా ఈ జ్యోతి మహాసభను స్థాపించుకొన్నారు. రాత్రి 9-30 గంటలదాకా ఈ కార్యక్రమం జరిగింది. ఆ తరువాత తెలుగు ముత్తైదువలు తమ తమ యిండ్లకు రావలసినదిగా వత్తిడి చేశారు. చంద్రమ్మ మొదలుగాగల వారింటికి వెళ్ళి వారి గృహాలను చూడటం వారంతా ఆత్మబంధువులుగా భావించి శ్రీ కృష్ణారావుగారిని ఆదరించడం జరిగింది. తమ గృహాల్ని, వంట యిళ్ళను చూపించడం, తమ మాతృదేశాన్నుండి వచ్చిన దగ్గరి బంధువుగా భావించి అమిత ఆప్యాయతతో మర్యాదలు చేయడం జరిగింది. వెంట తీసుకొని వెళ్లిన టేపురికార్డర్లను ఉపయోగించి అక్కడి చాలామంది తెలుగు వారిని ప్రశ్నలు వేసి శ్రీ కృష్ణారావుగారు సమాధానాలు చెప్పించారు.

అమ్మా మీ పేరేమి ?

నా పేరు లచ్చుమమ్మ.

ఎక్కడి నుంచి వచ్చారు ?

ఇశాకపట్నం నుంచి మా ముత్తాతలు వచ్చేశారు.

ఎంత మంది పిల్లలు ?

నల్గురు పిల్లలు.

క్షేమమేనా ?

నిండా సంతోషం.

మీ పేరమ్మా ?

తులసెమ్మ. మా పిల్లలు ఇంగ్లెండులో వున్నారు.

మీరమ్మ ?

నేను చెంద్రమ్మ. అంద్రకూ పెళ్ళయిపోయింది. తెలుగోళ్ళం. మా తల్లీ, తంద్రీ తెల్గు మాటాడేరు. మేమూ మాట్లాడుతాం. మీరు మా దేశం రావడం నిండా సంతోషం.
నేను ఎవరో తెలుసా ?

మీరు మా బంధువులు. చుట్టాలు. తెల్గువాళ్లు. మా తెలుగుకోసం, మా తెల్గువాళ్ళ కోసం వచ్చేరు. మా తెల్గును ఎత్తనానికి తెల్గు జాతినిఎత్తనానికి వచ్చేరు. మీరు మా బంధువులు.

తెలుగు బాగుపడటానికి ఏం చేయాలమ్మా చంద్రమ్మా ?

తెల్గు మాట్లే ఆడాలి. తెల్గు చదువే నేర్వాల. తెల్గు గంభీరం, తెల్గు మాట గొప్ప. మా తాత తెల్గు మాట ఆడేరు. మా నాయన ఆడేరు. ఏరే మాట ఆడరాదు.

మీ పేరు ?

లతమ్మ. అంతా కల్సుకున్నాం. అక్కడి మన తెలుగోళ్లకు నిండా నమస్కారం చెప్పండి.
హైదరాబాదు వస్తారా ?
వస్తాం. మా తెలుగు దేశం చూస్తాం. ”

ఈ విధంగా మారిషస్ పర్యటన సమయంలో ప్రతి చోటా ప్రశ్నలు, సమాధానాల కార్యక్రమం నిర్విరామంగా సాగింది. ఈ కార్యక్రమం అక్కడి తెలుగువారిలో మంచి ఉత్సాహం కలిగించింది. బాలురు, బాలికలు, పురుషులు, స్త్రీలు, వృద్ధులు అంతా ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

జ్యోతి మహాసభ వారు ఆ రాత్రి రోజ్ బెల్ హోటలులో విందు ఏర్పాటుచేశారు. చాలా మంది తెలుగు వారు ఆ విందులో

పాల్గొన్నారు. రాత్రి 11 గంటలదాకా విందుజరిగింది. విందు పూర్తి అయిన తరువాత తెలుగువారు పాటలు పద్యాలు పాడి వినిపించారు. ఆ కార్యక్రమం పూర్తిచేసుకొని రాత్రి 12 గంటలకు మకాం చేరుకొన్నాం.

ది. 27-8-1976 నాడు, ఉదయం ఆంధ్ర మహాసభా భవనంలో అక్కడి తెలుగు ప్రముఖుల సమావేశం ఏర్పాటు చేశారు. మారిషస్‌లోగల తెలుగు ప్రజల అవసరాలను గురించి, భారత ప్రభుత్వ సహకారంతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చేయగల సాయాన్ని గురించి ఆ సమావేశంలో చర్చలు జరిగాయి మారిషస్ తెలుగు వారికి అవసరమైన తెలుగు పాఠ్యపుస్తకాలు ఆంధ్రప్రదేశ్‌లో తయారు చేయించినందున ప్రయోజనం ఉండదని, మారిషస్‌లోనే వ్రాయించి, అక్కడే అచ్చు వేయించడం మంచిదని, తెలుగు ముద్రణకు అవసరమైన సాయం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చేయాలని నిర్ణయించారు. మహాత్మాగాంధీ సంస్థాన్‌లో అచ్చుమిషన్లు ఉన్నాయని, తెలుగు టైపు మాత్రం అవసరమైనంత పంపితే చాలని కూడా తేలింది. ఆంధ్రప్రదేశ్ వచ్చాక ఈ విషయమై శ్రీ కృష్ణారావుగారు కొంత కృషి కావించారు. త్వరలోనే యీ కృషి సఫలమవుతుందని విశ్వసిస్తున్నాను.

తెలుగు పుస్తకాలు, పత్రికలు మొదలగునవి మారిషస్ పంపమని అక్కడి వారు తెలియజేశారు. వేలాది తెలుగు పుస్తకాలు సేకరించి అంతర్జాతీయ తెలుగు సంస్థ ద్వారా మారిషస్ పంపించారు; ఇంకా పంపవలసిఉన్నది. డ్యాన్సు ట్రూపులు, డ్రామా ట్రూపులు, హార్మోనియం, తబలా, తాళాలు, నృత్య సామగ్రి డాక్యుమెంటరీ ఫిల్ములు పంపమని కూడా అక్కడి వారు తెలియజేశారు. తెలుగు ప్రజలు మారిషస్ దేశానికి, మారిషస్ ప్రజలు తెలుగు దేశానికి తరచుగా వచ్చి పర్యటించేందుకు అవకాశం

కల్పించవలని, అందువల్ల తెలుగు ప్రజల మధ్యా సత్సంబంధాలు పెరుగుతాయని అంతా ఏకగ్రీవంగా తమ అభిప్రాయం వెల్లడించారు. ఈ విషయంలో ఆంధ్ర ప్రభుత్వాధినేతలు, అవసరమైన చర్యలు తీసు కోనవలసి ఉంది.

ఆ రోజు మధ్యాహ్నం నుండి బయలుదేరి మూడు ప్రభుత్వ పాఠశాలలు చూశాము. ఆ మూడు పాఠశాలల్లోను తెలుగు ఉపా ధ్యాయులు పనిచేస్తున్నారు. ఆ రోజు సాయంత్రం చివరి సభ శ్రీ వీరాస్వామిగారి అధ్యక్షతన జరిగింది. అది ఆంధ్ర మహాసభ అధ్యక్షులు అచ్చన్నగారి గ్రామం అక్కడ పెద్ద స్థాయిలో సభ జరిగింది. ఆ సభలో వృద్ధులు, స్త్రీలు, పురుషులు అమితంగా వచ్చి పాల్గొన్నారు.

*డా॥ కరన్ సింగ్ గారి ఆగమనం*

ఆ సాయంత్రం భారత ప్రభుత్వ హైకమీషనర్ ఖురానా, ద్వితీయ ప్రపంచ హిందీ మహాసభల్లో పాల్గొనేందుకు ప్రపంచం నాలుగు చెరగులనుండి మారిషస్ వచ్చిన వారందరి గౌరవార్థం భారత హైకమీషనర్ భవనంలో టీ పార్టీ ఏర్పాటు చేశారు. ఆ సాయంత్రమే బొంబాయి నుండి రెండు విమానాలలో భారత ప్రతినిధులు ఎక్కువ సంఖ్యలో మారిషస్ చేరుకొన్నారు. డా॥ కరన్ సింగ్ భారత ప్రభుత్వ ప్రతినిధి వర్గానికి నాయకులు. శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు ఆంధ్రప్రదేశ్ నుండి వచ్చిన ప్రతి నిధులను వారికి పరిచయం చేశారు.

అచ్చన్నగారి మామగారి ఇంట్లో ఆ రాత్రి విందు ఏర్పాటు చేశారు. ఈ విందుకు శ్రీ టి. హయగ్రీవాచారిగారు, ఆంధ్ర విశ్వ విద్యాలయం, విశాఖపట్టణంనుండి వచ్చిన శ్రీ జి. సుందర రెడ్డిగారు కూడా హాజరైనారు. రాత్రి పొద్దు పోయిందాకా అక్కడ వివిధ కార్యక్రమాలు జరిగాయి.

*ద్వితీయ ప్రపంచ హిందీ మహాసభల ప్రారంభం*

ది. 28-8-1976 నుండి మహాత్మా గాంధీ సంస్థాన్ పేరిట ప్రపంచ దేశాల కూడలిగా నిర్మాణమైన భవనాల మధ్యనగల విశాలమైన ప్రాంగణంలో ప్రత్యేకించి నిర్మాణం చేయబడిన సభాస్థలిలో ద్వితీయ ప్రపంచ హిందీ మహాసభలు ప్రారంభమైనాయి. భారత దేశం తరువాత హిందీ భాష మాట్లాడేవారు ఎక్కువ సంఖ్యలో నివసిస్తున్న దేశం మారిషస్, ముఖ్యంగా బీహారుకుచెందిన హిందీ భాషీయులు ఎక్కువ.

ద్వితీయ ప్రపంచ హిందీ మహాసభలు పూర్తిగా అక్కడి ప్రభుత్వ ఆధ్వర్యంలోనే జరిగాయి. వివిధ మతాల, భాషల వారంతా ఈ మహాసభల్ని విజయవంతం చేసేందుకు ప్రభుత్వం వారికి అమితంగా సహకరించారు. మారిషస్‌లో ఇంగ్లీషు, ఫ్రెంచి భాషలు ఇప్పటికీ ప్రభుత్వ భాషలుగా వున్నాయి. అక్కడి భారతీయులంతా వాటి ప్రభావం తగ్గాలని, భారతీయ భాషలకు ప్రాధాన్యం రావాలని కోరుతున్నారు. దరిదాపుగా అక్కడి భారతీయులందరికి హిందీభాష వచ్చును. ద్వితీయ ప్రపంచ హిందీ మహాసభల ప్రభావంవల్ల మారిషస్‌లో భారతీయ భాషయగు హిందీకి ప్రభుత్వంలో మహత్తరమైన స్థానం లభిస్తుందని అక్కడివారు ఆశించారు. అక్కడి భారత ప్రజల్లో మాత్రం ప్రభుత్వ స్థాయిలో ఇంగ్లీషు, ఫ్రెంచి భాషకు గల ప్రాముఖ్యం విషయంలో అసంతృప్తి విపరీతంగా వున్నది. భారత దేశం నుండి 150 మంది దాకా ప్రతినిధులు మారిషస్ వచ్చి ఈ మహాసభల్లో పాల్గొన్నారు.

*తెలుగువారికి గౌరవం, మండలిగారి ఉపన్యాసం*

ఆంధ్రప్రదేశ్ నుండి వెళ్ళిన శ్రీ మండలి వెంకట కృష్ణారావు గారిని ఒక చర్చాగోష్ఠి అధ్యక్షవర్గంలో చేర్చి గౌరవించారు,

తెలుగువారైన శ్రీయుతులు టి. హయగ్రీవాచారి, జి. సుందరరెడ్డి అరికపూడి రమేష్‌చౌదరి, వేమూరి రాధాకృష్ణమూర్తిగారలకు వివిధ సభల్లో మాట్లాడే అవకాశం కల్పించి ఆదరించారు. ఒక చర్చా గోష్ఠికి కన్వీనరుగా శ్రీ వేమూరి ఆంజనేయ శర్మగారునియమితులై విజయవంతంగా ఆ గోష్ఠి కార్యక్రమం నిర్వహించారు. ఈ విధంగా ప్రపంచ వేదికమీద ఆంధ్రప్రదేశ్ నుండి మారిషస్ వెళ్ళిన తెలుగు వారందరికీ అవకాశం కల్పించి ఆంధ్రప్రదేశ్ ఎడల ఆప్యాయత, ఆదరణ చూపించడం జరిగింది, ప్రపంచమందలి అనేక దేశాల నుండి వచ్చిన ప్రతినిధులందరు ఆ మహాసభల్లో పాల్గొన్నారు. ప్రపంచంలోగల వైవిధ్యం ఆ వేదికమీద మూర్తీభవించిందని చెప్ప వచ్చును. తమకు కేటాయించిన మూడు, నాలుగు నిమిషాలలో శ్రీ కృష్ణారావుగారు అధ్యక్షోపన్యాసం హిందీలో ఇచ్చి ప్రధానమైన ఒకటి రెండు విషయాలను గురించి క్రింది విధంగా ప్రకటించారు.

సోదర సోదరీమణులారా !

అందరికీ వందనాలు

'మారిషస్ ఒక మినీ ఇండియా, ఇది మినీ ప్రపంచం కూడా. ద్వితీయ ప్రపంచ హిందీ మహాసభల్లో పాల్గొనేందుకై ఆంధ్రప్రదేశ్ నుంచి రాగలిగినందుకు సంతోషిస్తున్నాను. ఈ మహాసభల ఆహ్వాన సంఘం, మారిషస్ వారు నన్ను ఆహ్వానించినందుకు కృతజ్ఞుణ్ణి. భారత దేశాన్నుండి ఇక్కడికి వచ్చిన భారత ప్రభుత్వ ప్రతినిధి వర్గంలో నన్ను కూడా ఒక సభ్యునిగా ఎన్నుకొన్నందుకు భారత ప్రభుత్వానికి ధన్యవాదాలు. ఈనాటి గోష్ఠికి అధ్యక్ష వర్గంలో నాకు కూడా స్థానం కల్పించి నన్ను గౌరవించినందుకు హృదయ పూర్వక ధన్యవాదాలు.

నేను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో విద్యా సాంస్కృతిక శాఖల మంత్రిగా ఉన్నాను. అందువలన మారిషస్ వచ్చిన తరువాత ఇక్కడి సుమారు 30 కేంద్రాలకు వెళ్ళిచూచాను. చాలా స్కూళ్లకువెళ్ళాను. అనేక సభల్లో పాల్గొన్నాను. మారిషస్‌లోని విద్యా విధానాన్ని పరిశీలించాను. ఇంగ్లీషు, ఫ్రెంచి భాషలేగాక హిందీ, తెలుగు, తమిళం, మరాఠీ, ఉర్దూ, చైనా భాషలు కూడా ఇక్కడి స్కూళ్లలో బోధింపబడుతున్నాయి. మారిషస్ ప్రభుత్వం ఉదారబుద్ధితో ఈ భాషల బోధనకు అన్నివిధాల సహకరిస్తున్నది. ఇందుకు మారిషస్ ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను.

మారిషస్‌లో హిందీ మాట్లాడేవారు ఎక్కువగా వున్నారు. మారిషస్‌లో నివసిస్తున్న 50 వేల మంది తెలుగు వారందరికీ హిందీ వచ్చును. భారతదేశంలోను, ప్రపంచంలోని అనేక ఇతర దేశాలలోను హిందీ మాట్లాడేవారు ఎక్కువగా వున్నారు. ఇంత మంది మాట్లాడుతున్న భాషకు తగిన స్థానం లభించాలి ఇది అవసరం కూడా మారిషస్‌లో జరుగుతున్న ద్వితీయ ప్రపంచ హిందీ మహాసభలు ఇందుకు కృషి చేసి విజయం సాధించగలవని విశ్వసిస్తున్నాను.

హిందీ భాషా ప్రచారానికి హిందీ ప్రచార సంస్థలు ఎంతో కృషి చేశాయి. అందువలన హిందీ ప్రచారం విరివిగా జరిగింది. హిందీ ప్రచార రంగంలో మహాత్మా గాంధీగారికి మహత్తరమైన స్థానం వున్నది. దక్షిణభారత హిందీ ప్రచార సభను స్థాపించి హిందీ ప్రచారం చేయించారు. ఇంకా ఎన్నో సంస్థలు పని చేశాయి. చేస్తున్నాయి. అవన్నీ మరింత ఉత్సాహంతో పని చేయాలి.

ఈ మహాసభల తరువాత ఫాలో అప్ ప్రోగ్రాం అవసరమని మనవి చేస్తున్నాను. హిందీ కేవలం ఒక భాషగా మాత్రమేగాక, సాంస్కృతిక సమైక్యతకు ప్రతీకగా రూపొందింది. ప్రపంచ హిందీ

మహాసభలు సాంస్కృతిక రంగంలో కూడా పని చేయాలి. ప్రపంచ హిందీ మహాసభల కార్యక్రమాలు నిర్వహించే ప్రపంచ హిందీ కేంద్రం ఒకటి మారిషస్ దేశంలో నెలకొల్పడం అవసరమని ఈ సందర్భంలో మనవి చేస్తున్నాను. ఇది చాలా పెద్దపని. మారిషస్ ఇందుకు అనుకూలమైన దేశం. మీరంతా ఈ విషయంలో అవసర మైన నిర్ణయం చేయాలని కోరుతున్నాను. అందరికీ ధన్యవాదాలు.

28, 29, 30 తేదీలు మూడు రోజులూ హిందీ మహాసభల కార్యక్రమంలో పాల్గొన్నాము. ప్రతి రోజు ప్రభుత్వ స్థాయిలో జరిగిన విందుల్లోను, వివిధ కార్యక్రమాల్లోను, పాల్గొన్నాము. కార్యక్రమాలన్నీ పెద్దస్థాయిలో విజయవంతంగా జరిగాయి.

నాగపూరులో జరిగిన ప్రథమ ప్రపంచ హిందీ మహాసభల్లో మూడు నిర్ణయాలు ప్రధానంగా చేయబడ్డాయి 1. ఐక్యరాజ్య సమితిలో హిందీని అధికార భాషల్లో చేర్చుట. ఈవిషయం మీద మారిషస్‌లో చర్చలు జరిగాయి. ఒక్క భారత దేశమేగాక యితర దేశములో కూడా యీ విషయమై పని జరగడం అవసరమనీ, ఇతర దేశాలు కూడా పూనుకొని ఈ కార్యక్రమాన్ని అమలులో తీసుకొని రావాలని చర్చల తరువాత నిర్ణయం చేయబడింది. 2. ప్రపంచ హిందీ విద్యాపీఠ స్థాపన; ఈ బాధ్యతను వార్ధాలో గల రాష్ట్రభాషా ప్రచార సమితి స్వీకరించి పని చేస్తున్నది భవన నిర్మాణం ప్రారంభమై, కార్యక్రమం ముందుకు సాగుతున్నది. 3. ప్రపంచ హిందీ మహాసభలు సాధించిన విజయాలకు స్థిరమైన స్వరూపం కల్పించుటకు ఒక ప్రణాళికను సిద్ధం చేసి ప్రపంచ హిందీ మహాసభల జాతీయ సమితి భారత ప్రభుత్వానికి అందజేసింది. భారత ప్రభుత్వం అంగీకారంలో ఆ ప్రణాళికను అమలుచేయవలసి ఉన్నది. అయితే కార్యక్రమాలనన్నింటి విషయమై పనిచేయుటకు, ప్రపంచ

స్థాయిలో హిందీ పత్రికను నడుపుటకు ఒక కార్యాలయం మారిషస్‌లో ప్రారంభించవలెనను అభిప్రాయం సర్వత్రా కలిగింది. ఆ అభిప్రాయాన్ని శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు తమ ఉపన్యాసంలో స్పష్టంగా ప్రకటించారు.

ఈ మహాసభల సందర్భంలో భారత ప్రభుత్వం వేలాది హిందీ గ్రంథాల ప్రదర్శనం ఏర్పాటు చేసింది. ఆ గ్రంథాలను మహాసభలు పూర్తికాగానే డాక్టర్ కరన్‌సింగ్ భారతదేశం పక్షాన మారిషస్ దేశానికి కానుకగా అందజేశారు. అంతర్జాతీయ స్థాయిలో హిందీ, మరియు హిందీ భాషా స్వరూపం, వైజ్ఞానిక ప్రక్రియలు, యంత్రాలు, హిందీ భాషాప్రయోగం, ప్రపంచంలో హిందీ భాషాధ్యయన సమస్యలు, స్వైచ్ఛిక హిందీ సంస్థలు, హిందీ భాషా ప్రచారం అను నాలుగు విషయాలపై చర్చాగోష్ఠులు జరిగాయి. ఈ గోష్ఠులు విడివిడిగా గాక ప్రతినిధులు, ప్రేక్షకులు అంతా వినే పద్ధతిన సామూహికంగా ఏర్పాటు చేయబడ్డాయి. ఆహ్వాన సంఘం పక్షాన ప్రతినిధులందరికీ భోజన వసతి సౌకర్యాలు కల్పించబడ్డాయి. ప్రభుత్వం వారే పూనుకొని మహాసభల్ని జరిపినందున ప్రతినిధులకు, సౌకర్యాలు ఎక్కువగాను, సంతృప్తికరంగాను చేయగలిగారు.

ఆహ్వాన సంఘాధ్యక్షులు, నిరాడంబరులు, కార్యకర్తగా కష్టపడి పనిచేసే మనస్తత్వం గల అప్పటి మారిషస్ క్రీడా శాఖా మాత్యులు - ఇప్పటి పరిశ్రమల శాఖామాత్యులు, శ్రీ దయానంద వసంతరాయ్‌గారిని ఈ మహాసభల వల్ల కలిగే ప్రయోజనాలేమిటని పత్రికా విలేఖరులు ప్రశ్నించారు. అందుకు వారు ఈ విధంగా సమాధానం ఇచ్చారు.

"అంతర్జాతీయంగా జరిగే మహాసభల్ని లాభనష్టాల దృష్ట్యా కూచి చూడకూడదు. ఆ విధంగా లాభం ఇంత, నష్టం ఇంత అని

తేల్చి చెప్పడం కూడా కష్టమే, ఇలాంటి సమ్మేళనాల ప్రయోజనాలు బహు విధాలుగాను, దీర్ఘకాలికమైనవిగాను ఉంటాయి. మారిషస్ దేశంలో జరుగుతున్న ఈ ద్వితీయ ప్రపంచ హిందీ మహాసభల్లో పాల్గొనేందుకు 40 దేశాల నుండి ప్రతినిధులు వస్తున్నారు. వీరంతా మన దేశాన్ని బహు దగ్గరగా చూస్తారు. మన సద్భావాల్ని స్నేహాలను వెంటబెట్టుకొని తిరిగి తమ తమ దేశాలకు వెళతారు. ఈ ప్రతినిధుల ద్వారా మారిషస్ దేశపు యదార్థ స్వరూపం ఆయా దేశాలకు చేరుతుంది. ఈ విధంగా సమస్త హిందీ ప్రపంచంతో మనకు ఆత్మీయత పెరుగుతుంది. దగ్గర సంబంధం ఏర్పడుతుంది. మన దేశ ప్రజల హృదయాలపైన ఈ మహాసభల ప్రభావం పడుతుంది. ప్రపంచం మొత్తం మీద ఇంత మంది ప్రజలు తమ భాషతో సంబంధం కలిగివున్నారని తెలుసుకొన్నప్పుడు మన వాళ్ళకు స్వభాషాభిమానం పెరుగుతుంది. హిందీ భాషా ప్రచారంలో నిమగ్నమైయున్న వారందరికీ మరింత శక్తిసామర్థ్యాలతో ఈ పని చేసేందుకు ప్రేరణ కలుగుతుంది."

30 వ తేదీ సాయంత్రం హిందీ సభల ముగింపు సమావేశ జరిగింది. ఆ రాత్రి మారిషస్ ప్లానింగ్ మినిష్టరు శ్రీ జగత్సింగ్ విందు ఏర్పాటు చేశారు. అక్కడ జరిగిన విందులన్నీ విదేశీ పద్ధతులలోనే జరిగాయి. అయితే శాకాహారానికి సంబంధించిన పదార్థాలు కూడా ప్రత్యేకించి తయారు చేయించారు.

మేము ముందుగానే జాగ్రత్తపడినందున విమానాశ్రయంలో పని చేస్తున్న శ్రీ విద్యాసాగర్ గారి సాయంతో 31 వ తేదీ తిరుగు ప్రయాణానికి ఏర్పాట్లు పూర్తిచేసుకొన్నాము. ముందుగా అనుకొన్న ప్రకారం అయితే 31 వ తేదీ ఉదయమే మారిషస్‌లో విమానం బయలుదేరాలి. కాని మారిషస్ ప్రభుత్వం వారి కోరిక

ప్రకారం ఆ రోజు రాత్రికి విమానం బయలుదేరేందుకు ఏర్పాట్లు జరిగాయి.

31 వ తేదీ ఉదయం మారిషస్ చేరుకొన్నప్పటి నుండి మా వెంట ఉన్న మారిషస్ ప్రభుత్వ విద్యాశాఖలో తెలుగు విభాగంలో ఉద్యోగిగా ఉన్న శ్రీ పుష్పరాజ్ సూరయ్యా గారింటి దగ్గర టిఫిన్ తీసుకొని ప్రపంచ హిందీ మహాసభల ముగింపు సందర్భంలో ఆహ్వాన సంఘం ఏర్పాటుచేసిన పూర్ణాహుతి మరియు స్థూప నిర్మాణ కార్యక్రమాల్లో పాల్గొని మారిషస్ ప్రభుత్వ ఆధ్వర్యంలో నడుస్తున్న ఉపాధ్యాయ శిక్షణ మహావిద్యాలయం చూచేందుకు వెళ్లాము. శ్రీ వేటూరి ఆనందమూర్తిగారు కూడా అక్కడకు వచ్చారు. అక్కడ ఇంగ్లీషు, ఫ్రెంచి భాషలేగాక హిందీ, తెలుగు, ఉర్దూ, మరాఠీ, చైనా భాషల ఉపాధ్యాయులకు కూడా ఉపాధ్యాయ శిక్షణకు ఏర్పాట్లు ఉన్నాయి. తెలుగు, తమిళ భాషలలో శిక్షణ పొందుతున్న వారి తరగతులకు వెళ్ళి శ్రీ కృష్ణారావుగారు ఎంతో జాగ్రత్తగా వారి భాషా జ్ఞానాన్ని పరిశీలించి చూచారు. ఉపాధ్యాయులతో కలిసి చర్చించారు. అక్కడ వాతావరణం ప్రశాంతంగా వున్నది అనేక భాషల గ్రంథాలు అక్కడి పెద్ద గ్రంథాలయంలో ఉన్నాయి. తెలుగు గ్రంథాలు తక్కువగా వున్నాయి. ఆ టీచర్స్ ట్రైనింగ్ కాలేజీకి మారిషస్ దేశంలో మంచి ప్రచారం ఉన్నది అక్కడి నుండి ఆంధ్ర మహాసభకు వచ్చి అక్కడ జరిగిన కార్యక్రమంలో పాల్గొని తెలుగు వర్తక ప్రముఖులు శ్రీ గారయ్య గారి దుకాణానికి వెళ్ళాము. అది చాలా పెద్ద దుకాణం. ప్రపంచంలోని అనేక దేశాలకు సంబంధించిన బట్టలు అక్కడ దొరుకుతాయి. భారత దేశపు చీరలకు మంచి గిరాకీ ఉన్నదనీ, కాని భారతదేశపు వస్త్రాలకు సంబంధించిన వ్యాపారం సక్రమంగా లేదని విన్నప్పుడు బాధకలిగింది. అది భారత ప్రభుత్వ స్థాయిలో పరిష్కరింపబడవలసిన

వ్యవహారం. ఆ తరువాత శ్రీ సింహాద్రి వీరాస్వామి గారింటికి భోజనానికి వెళ్ళాము. సింహాద్రిగారి ఇంట్లో విభిన్న సంస్కృతుల వైవిధ్యం కనబడింది. వారు ఆ దేశంలో మంచి పలుకుబడి గల నాయకులు. ఈ మధ్య జరిగిన ఎన్నికలలో గెలవడం వారి పలుకుబడికి తార్కాణమేనని చెప్పవచ్చును. ఇప్పుడు వారు మారిషస్ ప్రభుత్వంలో మంత్రిగా పనిచేస్తున్నారు. వారింటి దగ్గర పాలు తోడుబెట్టిన పెరుగు మాకు వడ్డించారు. పదార్థాలు కూడా రుచిగా ఉన్నాయి.

'Bon Voyage' : '*గుండె గొంతుకలోన కొట్లాడుతాది*'

ఆ మధ్యాహ్నం మూడు గంటలకు ఆంధ్ర మహాసభలో వీడ్కోలు సభ జరిగింది. ఆంధ్రమహాసభ వర్కింగ్ కమిటి సమావేశం కూడా జరిగింది. అక్కడి తెలుగువారు ఎంతో ఆత్మీయతతో వీడ్కోలు ఇచ్చారు; ఎన్నో కానుకలు కూడా అందజేశారు విమాన ప్రయాణం కావడం, విదేశీ వస్తువులు తీసుకొని రావడం విషయంలో కఠినమైన నియమ నిబంధనలు ఉండటం వలన అక్కడి తెలుగు సోదరులు కొంచెం ఆగవలసి వచ్చింది. లేకపోతే ఎన్నో కానుకలు అందజేసేవారే. అన్నింటి కంటె వారు చూపించిన ఆత్మీయత, ఆదరణకు అవధులు లేవు. తెలుగు నాటకాలు, ఏకాంకికాలు, తెలుగు పత్రికలు, సాంస్కృతిక బృందాలు, మద్దెలలు, హార్మోనియాలు, తాళాలు, చిరతలు, డ్యాన్సు టీచర్లు, తెలుగు ఫిల్ములు, అన్నిటికన్నా వేదం చదువుకొన్న పురోహితుడు మారిషస్ దేశంలో గల తెలుగు ప్రజలకు అవసరమని మరో పర్యాయం అక్కడి వారంతా ఆ సభలో ఉద్ఘాటించారు. ఆ క్రితం రోజున శ్రీ మండలి వెంకటకృష్ణారావు గారు టెలివిజన్‌లో మారిషస్ ప్రజలకు ఇచ్చిన ఈ క్రింది సందేశం ప్రసారం చేయబడింది.

"మారిషస్‌లోని తెలుగు ప్రజలకు
వందనములు

మారిషస్‌లో జరుగుతున్న ద్వితీయ విశ్వ హిందీ సమ్మేళనంలో భారత ప్రతినిధి వర్గ సభ్యునిగ పాల్గొనుటకు వచ్చినాను. ఆ అవకాశాన్ని పురస్కరించుకొని సహజ సౌందర్యానికి ఆత్మపట్టు అయిన ఈ దీవిని తెలుగువారు ఎలా అభివృద్ధి చేసింది, వారి పరిసరాలు ఎలా వున్నవి తెలుసుకోవాలనే కుతూహలంతో హిందీ మహాసభల ప్రారంభమునకు నాలుగు రోజుల ముందే మారిషస్‌కు చేరినాను.

మారిషస్‌లో 50 వేల మంది తెలుగువారు ఉన్నారు. తెలుగు భాష, తెలుగు సంస్కృతి సముద్ధరణకు 1946లో మారిషస్ ఆంధ్ర మహాసభ ప్రారంభించబడి నేడు 60 శాఖలతో విరాజిల్లుచున్నది. 3332 మంది సభ్యులున్నారు. 24వ తేదీన మహాసభ సమావేశంలో పాల్గొన్నాను. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు గారు మారిషస్ తెలుగు ప్రజలకు ఇచ్చిన సందేశాన్ని వినిపించాం. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము, అంతర్జాతీయ తెలుగు సంస్థ, ఇతర సంస్థలు ఇచ్చిన అనేక పుస్తకాలు, ఫోటోలు, డాక్యుమెంటరీ ఫిల్ములు మారిషస్ విద్యామంత్రి శ్రీ షాప్రోన్‌గారి ద్వారా ఆంధ్ర మహాసభ అధ్యక్షులు శ్రీ అచ్చన్నగారికి అందజేశాను. పార్లమెంటరీ కార్యదర్శి శ్రీ వీరాస్వామి సింహాద్రిగారు అధ్యక్షత వహించారు. భారత హైకమీషనర్ శ్రీ ఖురానాగారు ప్రసంగించారు.

25వ తేదీ ఉదయం ప్రధాన మంత్రి శ్రీ రామ్‌గులాంగారితోను విద్యా, ఆర్థిక శాఖామంత్రితోను ఇచ్చట తెలుగు వారి పరిస్థితులను గురించి చర్చించినాము. తెలుగు భాష, సంస్కృతి అభివృద్ధికి

పూర్తి సహకారం చేస్తున్నామని వారు చెప్పారు. తెలుగు వారికే గాక ఆ దీవిలోని వివిధ భాషల ఎడల మారిషస్ ప్రభుత్వము చాలా ఉదారంగా సహాయం చేయుట చాలా ఆనందాన్ని, సంతోషాన్ని కలిగించింది నాలుగు రోజులు మారిషస్ దీవిలోని తెలుగు వారు ఉన్న వివిధ ప్రాంతాలను సందర్శించాను. ఆంధ్ర మహాసభ ఏర్పాటు చేసిన ఈ పర్యటన కార్యక్రమం జయప్రదముగ జరుగుటయేగాక ప్రజలలో ఉత్సాహాన్ని, చైతన్యాన్ని కలిగించింది. దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఆంధ్రప్రదేశ్ కార్యదర్శి శ్రీ వేమూరి రాధా కృష్ణమూర్తి, మారిషస్ ఆంధ్ర మహాసభ అధ్యక్షులు శ్రీ బాల అచ్చన్న, కార్యదర్శి శ్రీ బాలగోపాలుడు, ఎడ్యుకేషన్ సూపర్వైజర్ శ్రీ సూరయ్యగార్లు వెంట వున్నారు.

తెలుగు ప్రజలలో వచ్చిన ఉత్సాహము వర్ణింపనలవికానిది. 85 సంవత్సరాల వృద్ధుల నుండి చిన్న పిల్లల వరకు ఆబాలగోపాలం సభలకు విచ్చేశారు. "మా తాత ముత్తాతల దేశం నుంచి నాయనా వచ్చావు: నిండు సంతోషము. మా ఇంటికి రావాలి" అంటూ నన్ను పట్టుకొని తీసుకొని వెళ్లిన సంఘటనలు నన్ను ఆనందంలో ముంచెత్తాయి. వారి మాటలు, పాటలు తన్మయత్వం పొందింప జేశాయి. తెలుగు దేశంలోని జానపద పాటలను మరపించాయి. ప్రార్థనలు, భజనలు, పాటలు వినేవారికి ఇంపును, ఆనందాన్ని కలిగించాయి. తెలుగు వారు ఈ దీవికి వచ్చి 112 సంవత్సరాలు అయినా తెలుగు భాషను మరచిపోకుండా తెలుగు సంస్కృతిని కాపాడుకొంటూ వస్తున్నారంటే చాలా ప్రశంసనీయమైనది.

పాఠశాలలు కొన్నింటిని చూచినాను. మంచి భవనాలు, క్రమశిక్షణ కలిగి బాగా ఉన్నాయి. తెలుగు సెక్షన్సు చూచినాను. 67 పాఠశాలల్లో 108 మంది తెలుగు ఉపాధ్యాయులు పనిచేయు

చున్నారు. తెలుగు వారు పిల్లలను ఎక్కువ మందిని తెలుగు చదువు కోడానికి ప్రోత్సహించాలి. ఆంధ్ర మహాసభ నాయకులు విద్యా, సాంస్కృతిక అభివృద్ధికి తీసుకోవలసిన చర్యలను గురించి చర్చించారు పాఠశాలలకు, లైబ్రరీలకు పుస్తకాలు, తెలుగు టైపు మిషన్లు, తెలుగు ప్రింటింగ్ ప్రెస్ కావాలన్నారు. సాంస్కృతికంగా ప్రజలను ఉత్సాహపరచడానికి సాంస్కృతిక దళాలను పంపమని కోరారు. విద్యార్థులకు స్కాలర్ షిప్‌లను ఏర్పాటు చేయమన్నారు.

మారిషస్, భారత, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాలు ఎవ్వరు ఏ విధంగా ఈ విషయంలో సహకరించవలసి ఉంటుందో పరిశీలించి చర్యలు తీసుకొనబడును. రేపు భారతదేశానికి తిరిగి వెళ్లుతున్నాను. తెలుగు వారిలో సమైక్యత, సంస్కృతి, భాష, అభివృద్ధికి తోడ్పడు తున్న ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు గారు ఉండుట మన అదృష్టం. మీ పరిస్థితులను గురించి వారికి తెలియజేసి తప్పక సహకారము ఇచ్చేలాగ ప్రయత్నిస్తాను తెలుగువారు వారి శక్తియుక్తులను వినియోగించుకొని శ్రమించి మారిషస్‌ను అభివృద్ధి పరచినారు. ఈ దీవి అభివృద్ధికి ఇతోధిక కృషి చేయాలని తెలుగు భాషలోని తియ్యదనాన్ని తెలుగు సంస్కృతిలోని ఆనందాన్ని అనుభవించాలని కోరుకొంటున్నాను. ఈ దేశ తెలుగు ప్రజలకు మన మాతృదేశ తెలుగు ప్రజల, ప్రభుత్వం తరఫున శుభాకాంక్షలు అందజేసు కొంటున్నాను.

భారత, మారిషస్ మైత్రి చిరకాలం వర్ధిల్లాలని కోరుకొంటున్నాను.''

ఆంధ్ర మహాసభలో జరిగిన వీడ్కోలు సభలో చదివి వినిపించిన తెలుగు పత్రం యథాతథంగా ఇక్కడ ప్రకటిస్తున్నాను. ఈ పత్రం

మారిషస్ దేశంలోగల తెలుగు భాషా స్వరూపాన్ని, వారి ఆప్యాయతను, వారి మనోభావాల్ని ప్రతిబింబిస్తున్నది.

డియర్ సర్,

మమ్ము విడిచి వెళ్ళిపోతున్నారు; మీరు ఇక్కడికి మళ్ళీ మళ్ళీ రాగలరని మన అందరిని ప్రార్థన; మరియు మనవి.

నిన్న మా ఇంట్లో వచ్చి మేమందరికి ఏ సంతోషము, గౌరవము తెచ్చినారు. మిమ్ము కృతజ్ఞత చెప్పాలంటే నా వద్ద లేక నా అమ్మ నాన్నల వద్ద అయిన సరే ఆ నిజమైన పదములు, వాక్కులు లేవు. ఎట్లా ఆ కృతజ్ఞత చెప్పాలా అని తెలియదు ఇంతే కాక మన whole Mauritius తెలుగు వారికి ఆనందముతో, ప్రేమతో గౌరవించారు. మీరు మా మధ్యములో ఒక వారం ఉండి మన సమస్యములన్నీ తెలుసుకొనినందుకు మీరు ఈ సమస్యలు కొంతవరకు తీరగలదని మన అందరి తెలుగు వారిలో దృఢముగా విశ్వాసము కలిగినది.

ఈనాడు జీవించుటకు మాలో ఎంతో సాహసము కలిగినవి. ఎట్లా ఒక బిడ్డ ఎంతో నాళ్ల తరువాత తన తల్లిదండ్రులతో కలిసినాడు, ఈ సందర్భమున అతనికి ఎంత ఆనందము, సంతోషము కలుగునో అట్లే మేము కూడ ఆ పరిస్థితిలో ఇప్పుడు యన్నాము అప్పుడప్పుడు ఇట్లే ఆంధ్ర నాయకులు మన దేశానికి వస్తూ ఉంటే మేము తప్పక ప్రగతి చేయగలము. అప్పుడు మన తెలుగువాళ్లు పై మతమునకు పోవుటకు విలువలేకుండ ఉండును. ఆంధ్రప్రదేశములో ఉండిన స్నేహితులను వందనములు సుబ్ యాత్రా...! "Bon Voyage" నమస్కారములు !

ఆ సాయంత్రం మారిషస్ ప్రధాని సర్ శివసాగర్ రామ్ గులామ్, ప్రపంచ ప్రసిద్ధికెక్కిన బొటానికాల్ గార్డెన్‌లో విదేశీ ప్రతినిధులు, మారిషస్ ప్రజల గౌరవార్థం గార్డెన్ పార్టీ ఏర్పాటు చేశారు. ఆ ఉద్యానవనంలో, చుట్టూ వంపులు తిరిగి పళ్లెంలా ఉండే పెద్ద తామరాకులను చిన్న చిన్న తటాకాలలో ప్రప్రథమంగా చూశాము. అది నిజంగా ప్రకృతి విశేషమే.

ఆ రాత్రికి భారత దేశానికి తిరుగు ప్రయాణం. అక్కడ సాయంకాలం 7 గంటలు దాటితే కొట్లు ఏమి ఉండవు. వెంటనే ఒక చైనా వారి కొట్టు తెరిచి ఉంటే అక్కడికి వెళ్ళి త్వరగా పిల్లలకు పనికివచ్చే కలాలు, మొదలుగాగల వస్తువుల్ని కొని హోటలుకు చేరుకున్నాం. సామానులను సర్దుకొని ఆ రాత్రి భోజనాలు ముగించుకొని విమానాశ్రయానికి బయలుదేరాం. హోటల్లో పని చేసే వారందరితో ఆ కొద్ది రోజులలోనే పరిచయాలు ఏర్పడ్డాయి. అందరి దగ్గర సెలవు తీసుకొని చాలా దూరాన ఉన్న ప్లైజన్సు విమానాశ్రయం రాత్రి 8-30 గంటలకు చేరుకొన్నాం. విమానాశ్రయానికి వద్దన్నా చాలా మంది తెలుగువారు వచ్చారు. ప్రపంచ హిందీ మహాసభల ఆహ్వాన సంఘ సభ్యులు, పెద్దలు కూడా విమానాశ్రయంలో ఉన్నారు ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ వసంతరాయ్ గారు ప్రతి ఒక్కరినీ కలుసుకొని అందరికీ ప్రేమతో వీడ్కోలు చెప్పారు. డైవరు శీర్రి మాకే, శ్రీ సూరయ్యగార్లు, ఆంధ్ర మహాసభ అధ్యక్ష కార్యదర్శులు, మొదలుగా గల వారందరివద్ద సెలవు తీసుకొని విమానం దగ్గరకు చేరుకొన్నాం.

శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారిని విమానాశ్రయంలోనే అధికారులు రెండు మూడు పర్యాయాలు పిలువవలసి వచ్చింది. విమానందాకా వచ్చి తెలుగువారు వారిని వదలలేక వదలలేక వదలడమే

అందుకు కారణం. రాత్రి 9 గంటలకు మారిషస్ విమానాశ్రయంలో మా విమానం బయలుదేరింది. ఆ రాత్రంతా ప్రయాణం చేసి మరునాడు తెల్లవారు ఝామున బొంబాయి విమానాశ్రయం చేరుకొన్నాము. బొంబాయి విమానాశ్రయానికి తెలుగు వారంతా వచ్చి కలుసుకొన్నారు. అక్కడ కాలకృత్యాలు తీర్చుకొని హైదరాబాదు బయలుదేరిన విమానంలో గం॥ 9-30 లకు బయలుదేరి సరిగ్గా 11-00 గంటలకు హైదరాబాదు విమానాశ్రయం చేరుకొన్నాం. మిత్రులు, పెద్దలు, స్త్రీలు, పురుషులు, వందలాది మంది హైదరాబాదు విమానాశ్రయం వచ్చి అభినందించారు.

విమానాలలో ప్రయాణం చేసి హైదరాబాదు చేరుకొన్న తరువాత కూడ మారిషస్ తెలుగు ప్రజలు పిన్నలు, పెద్దలు, విద్యార్థులు, విద్యార్థినులు ప్రతిచోట పాడిన వారి జండా పాట చెవుల్లో మార్మ్రోగుతూనే ఉన్నది.

ఈ దేశం మాదేశం
స్వతంత్ర దేశం మాదేశం !
ఉన్నతి నందుతున్న దేశం
ప్రగతి ఉన్నదేశం
రత్నం వంటిది
ముత్యం వంటిది
ఫలితమైన దేశం !

॥ఈ దేశం॥

ఎగురుచున్న మన జండా
ఎగురు చున్నదీ మది నిండా
ఎల్లకాలం
ఎల్ల వేళల
ముందుకు కదులుచున్న జండా !
॥ఈ దేశం॥

మా దేశం నాయకులు
కృషి చేసే నాయకులు
వారి ఉత్సాహము
వారి ధైర్యము
పెరుగుచున్న దేశం !
॥ఈ దేశం॥

(పాట అనువాదం : డా॥ వేటూరి ఆనందమూర్తి)

